పరబ్రహ్మణేనమః.

# రామరాయవిలాసము.

ఇది

శ్రీ పీఠికాపుర సంస్థాన ప్రధానకవీశ్వరులుగా నుండి
కీర్తిశేషులైన



బ్రహ్మశ్రీ

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిలవారిచే
రచియింపఁబడినది.

కాకినాడ:

సుజనరంజనీముద్రాక్షరశాలయందు ముద్రితము.

1911.



శ్రీరస్తు.

శుభమస్తు, అవిఘ్నమస్తు.

# రామరాయ విలాసము.

## ప్రథమాశ్వాసము.



వైదేహీవివాహవేళ రమణాం • ఘ్రిద్వంద్వ విస్ర
స్తముల్। గా వేగం దలఁబ్రాలు నించి త్రప
వీ • క్షల్వంచి ముత్తెమ్ములు। న్భావింపన్ మణులౌ
ట నేమగునో య • న్భ్రాంతిన్ విలోకింప న। ద్దే
విం గన్గొని నవ్వు రామవిభుఁ డా • ప్తిం బ్రోచు
సూర్యప్రభున్॥

సీ. రాత్రిందివైకస్ఫు • రణము చేగణుతింపఁ
దనరియ పంకజా • తప్రశస్తిఁ
గాంచి నిష్కంటక • కాండమై యమధుపా
ధారవిఖ్యాతిచే • తను దనర్చి
శతసహస్రాయుత • సంఖ్యాకపత్రసం
గతమై సదామోద • కలనఁ బేర్చి

రాజసమాదర • ప్రాజ్యమై విలసిల్లు
నిల్లుగలైనటంచు • నెలమిఁ బొంది
ప్రకట రావువేంక • టకుమార మహీపతి
సూర్యరాయవిభుని • శుభవిభాస
మానతరవిభాస • మానసద్మ చ్ఛద్మ
పద్మమున వసించుఁ • బద్మ యెపుడు. 2

సీ. చిన్ని జాబిలితోడఁ • జెలఁగి ముచ్చటలాడు
నెన్నొసల్ గల ముద్దుఁ • జిన్నవాని
గండుఁదుమ్మెదలతోఁ • గడఁగి ముచ్చటలాడు
కురులు గల్గిన లేఁత • కొమరువాని
నేనుంగుగున్నతో • నెదిరి కయ్యములాడు
బింకంబు గల యట్టి • పిల్లవాని
సింగంపుఁగొదమతోఁ • జెలరేఁగి చెరలాడు
బీరంబు గలయట్టి • పిన్నవాని

రావుకొలమను బనఁటి నీ • స్వామినుండు
తొగలయొకెమీనిఁ గబ్బంపు • మసవజేని
నడుగు టడిదంపుఁ బులుఁగు రా • యరిది మేని
వేల్పు గావుతఁ గొదలేని • పెరిమెఁ బూని. 3

మ. సుకరప్రక్రియ నిష్కళంకరుచిచే • శోభిల్లు సచ్చంద్రికా
మకరందంబు చకోరభృంగములు ప్రే • మంగ్రోల నాక్రాంతవా
డక చెన్నొందు సుమంబు నాదలను వే • డ్కం దాల్చు శర్వాణిరా
జకుమారాగ్రణిఁ బ్రోచుఁ గావుతఁ గళా • సంపూర్తి సంధించుచున్.

నాలుగుపాయముల్గఱచి • నాల్గుతెఱంగుల సేన గొల్వఁగా
నాలుగుదిక్కులం గెలిచి • నాల్గుపుమర్థము లుల్లసిల్లఁగా
నాలుఁగుమారులుం జిరత • రాయువు శ్రీయును గల్గునంచుఁ దా
నాలుగువాల సూర్యనర • నాఘన కీవుత బ్రహ్మ దీవనల్. 5

వ్రాయనేరనినాఁడె • వ్రాసి యిచ్చెనుగదా
శాసనంబులు బ్రహ్మ • శాసనముగఁ
జదువనేరనినాఁడె • చదివి చెప్పెనుగదా
పాఠ్యముల్ గంఠస్థ • పాఠములుగ
నెఱుక చాలనినాఁడె • యెఱుఁగఁజేసెనుగదా
భావివృత్తముల న • బ్రింబు గాఁగఁ
జూపు విప్పనినాఁడె • చూచి చెప్పెనుగదా
భృత్యనైజము దివ్య • దృష్టి గాఁగ
ననుచు నెద మెచ్చి ముద మిచ్చి • ఘనత హెచ్చి
మనుచుఁ జేఁదోడు వాఁదోడు • మనసుఁ దోడుఁ
గనుల దోడును నై వాణి • కరుణ శ్రీకు
మారమహీపతి సూర్యరా • ణ్మనుజవిభుని. 6

సతియును రాజమౌళిగని • సంతసిలన్ వెనకయ్య యయ్యు నే
యతులితుఁ డాదిపూజ్యత సు • తాగ్ర్యత సాధుగణాధిపత్య మ
ప్రతిహతిఁ బూనె నట్టి కరి వక్త్రుఁడు ప్రోవుతఁ గార్యసిద్ధి స
మ్మతి నిడి రావువేంకట కు • మారమహీపతి సూర్యరాయనిన్. 7

భావుకలీల రాజ్యపద • వర్తులు సుస్థిరకీర్తు లౌచు సు
గ్రీవవిభీషణుల్గనిరి • శ్రీరఘురాముని ప్రాపెవంటు సం

భావనఁ జేయ నట్టి హను • మంతుఁ డనంతజయంబుఁ గూర్చుచుం
బావనమూర్తిఁ పౌత్రుఁ గను • మార మహీపతి సూర్యరాయనిన్.

సీ. ఎవ్వానికావ్యంబు • లెఱిఁగించుఁ దొలుదొల్త
రామకథాభివ • ర్ణననిరూఢి
నేవానికవిత సం • భావింపఁగా నొప్పుఁ
గౌరవాంచితకథా • కథనపటిమ
నెవ్వాని కవనంబు • లేర్పరింపఁగ నొప్పు
సంభావితకుమార • సంభవమున
నెవని కవిత్వంబు • వివరింపఁగా నొప్పుఁ
బద్మనాయకనుతి • పరిక్రమమున
నట్టి మహనీయులఁ దలంతు • నస్మదీయ
కృతియుఁ దత్కృతులట్ల స • త్కృతి వహింప
భక్తి వల్మీకభవ సత్య • వత్యపత్య
కాళిదాస మయూర స • త్కవుల మదిని. 9

చ. గురురుచిమూఁడుమూర్తులును • గూడి త్రయీమయమూర్తిఁ దోఁచిన
ట్లరుదుగ మువ్వురుం గలసి • యంచిత పంచమవేదభారత
స్ఫురణముఁ జూపినట్టి పరి • శుద్ధుల నెన్నెద నన్నయార్య భా
స్వరమతి నెఱ్ఱప్రెగ్గడను • జక్కఁగఁ దిక్కనసోమయాజినిన్.

మ. విలసన్మార్ద్రవ కాంచనాంచలవిభా • విస్ఫారచీనాంబరా
వళిఁ గర్పూరపుఁబలుకు లుంచుగతిశుం • భద్దివ్యమత్కావ్యమం
దలఘు శ్రీనిధి రావు సూర్యవిభు నా • మాంకంబు సంధింప నె
ట్లలరుం గీటములట్లు దుర్మతులు రం • ధ్రాన్వేషముం జేయఁగన్.

క. అని యిష్టదేవతావం
దన సుకవిజనాభినంద • న కుకవిపరివ
ర్జన కుమతి నిరాకృతి శుం
భనముం బొనరించి యొక్క • వరకావ్యంబున్. 12

క. వచియించునప్పు డెల్లెడ
రుచియించునఁ బొడము రసముఁ • గ్రొవ్వనగతిఁ దా
లిచి యించుక కాకుండఁగ
రచియించుట కింపుఁ బెంపు • రహి వహియింపన్. 13

ఉ. ఉరుతరభక్తి మైఁ దులసి • యున్మ్రుఖులు న్విరులుం బొరింబొరిన్
సరములు గూర్చి వేల్పులకొ • సంగఁ బొసంగ నొసంగినట్లు సు
స్థిరముగ సంస్కృతాంధ్రపర • దేశ్యపదంబులఁ గూర్చి కావ్యముల్
దొరలకొసంగిన న్మదిఁ గు • తూహలమౌట నటుల్ ఘటించెదన్

గీ. బిందు శకటంబు లని వేఱె • పేరుగాని
రేఫయుగళంబుఁ గూర్చిరి • కృతులఁ గవులు
ఘనులు చెప్పినను భయంబుఁ • గాకయున్న
సంకరంబందు రెందు ని • ష్పత్తి లేదు. 15

గీ. ద్విత్వములయందొ దేశ్యాన్య • దేశ్యములనొ
శకటమంచు వచించుట • చనును గాని
కొన్ని యుభయంబు లంచును • గొన్ని సంక
రంబులని చెప్ప టొప్పునే • ప్రాజ్ఞులకును. 16

క. కావున రేఫద్వయికిం
గేవలతకు ననుమతించి • కృతులం గూర్పం

గా వెరవగునని యెంచెద
వావిరి దేశ్యాన్యదేశ్య ♦ పదములు పోలెన్.

క. కల్యఘముల నెల్లను నై
కల్యము గావింపఁ జాలు ♦ కల్యవిఘుల సా
కల్యముగఁ దీర్చికొని యొక
కల్యస్థలిహితులఁ గూడి ♦ కల్యాణమతిన్.

క. కారణజన్ముఁడు ప్రాజ్య మ
హీరాజ్యపదార్హగుణ స ♦ మృద్ధుఁడు రామ
క్ష్మారాడ్వరసుకృత ఫలా
కారుఁడు మనవిభుఁడు పెంపుఁ ♦ గను నూఱేఁడుల్.

క. అనుకొని తచ్ఛుభవాసర
మున సముచితభంగి మిత్ర ♦ ములతో సాయం
తనమున సమయం బారసి
ననువుగ దర్బారు కరుగు ♦ నప్పుడు వరుసన్.

సీ. చుట్టువారియగడ్త ♦ గట్టైన బలుకోట
దరి వెల్లబావుటా ♦ బురుజు దరిసి
గడియారముడివోని ♦ యడియాలములవీఁక
తవణించు సింగపు ♦ గవనిదాఁటి
ఫాదుశా బిరుదుశా ♦ బాసికీ యిడినదో
శాకా హజారంబు ♦ చాయనేగి
మోసలనేనుంగు ♦ మొగసాలనిలువు టు
ప్పరిగెల నీడ చ ♦ ప్పరముఁ జొచ్చి

తమ్ముఁ గాన్పించుకొనవచ్చి • తలఁగనీని
సందడిగమేటి దొరలున్న • సరస నరసి
నగరిముంగిటి పహరాల • జగతి దండఁ
బిలువ నంపించుకొనియుండు • నిలిచియుండ. 21

సీ. నునుఁగుట్టుపట్టు మె • త్తని మెత్తకోకికి
జగజంపుఁ బల్లంపు • జిగిబిగింపు
టంగువాఱుజగాది • టంపుజల్తారు ము
ప్పిరిసుట్టు ధూము చా • పెహ్హారంగు
ఫోన్మెఱుంగులరికా • బులు బలుతోరంపు
హొన్నులమెడపట్టె • యుదుటుచ్చాల
మొగముట్టుసొంపుఁ బెం • పులకెంపుఁ గల్లెంబు
చొకట్రపుఁ జికట్రని • సోగవాగ
చురుక్షు నిడువాలుతరటు కు • చ్చుల బెడంగు
చికిలిగరులతురాయర • బ్బిహుమాయి
సొరుమీఱంగఁ గై చేసి • సాదులిర్వు
రచ్చటికిఁ దెచ్చి రేలిక • యాజ్ఞవడసి. 22

క. అంతట నంతిపురంబున
నెంతయు సంతసముగదుర • నింతులు కుతుకా
క్రాంతములగు స్వాం • తములను
వింతగఁగై చేసి యనుప • విభునందనుఁడున్. 23

సీ. రతనంబులకుళాయి • జతనంబుగ జరీ బు

వెలిడాలుగలమేటి • వలిపంపు జోడంగి
లలిమేనఁ బూసిన • ట్టులవరించి
యపరంజిపూమినుకు • టాకుపచ్చపగాయి
యనువొంద గుత్తమరా • నట్టుతొడిగి
యొఱపైన యొరపైని • మెఱపూన నిడుదవా
లాడికపు ఖండువా • నడుమఁ గట్టు
చుట్టి పులితోలు పాపోసు • జోడుమెట్టి
పచ్చికస్తురినామంబు • పరిమళములు
పచ్చకప్రంపుఁదములపు • వాసనలును
నఱవిరిసరాలవలపుల • నలమికొనఁగ. 24

క. కరికలభసులభగతి భా
స్వరుఁడై చూపఱకుఁగనుల • పండువుగాఁ గం
బరఁగందురగంబున్నెడ
కరుదెంచె విలాసభాసి • హాసాననుఁడై. 25

మ. కెలనన్ నిల్చిన భూసురప్రతతికిం • గేల్మోడ్చి వారిచ్చు స
త్ఫలపుష్పాక్షత లర్థిమై యవితథా • ర్థపాంథ్రభవాశీర్వచః
కలనోల్లాసము మున్నుగాఁ గొని చెలం • గన్ వాహనారోహణో
త్కలికన్ డెందమునందుఁ గ్రందుకొనఁగం • ఖాణంబునుం డాయుచోన్.

మ. సరదారుల్ పరదారుణద్యుతిసమం • చన్మూర్తులై డక్కిణీ
తరపాపాగలు బుగ్గమీసములు ని • ద్దంపుస్సరాయీలు నం
గరఖాలున్నడికట్లుచెందిర పుఁజు • కట్టల్ చాకట్టుపుండాలు డాల్
తరవారుల్ మెఱయం జొహారులిడి శ • స్త్రస్వస్తికంబుల్ దగన్.

గీ. అగలు బగలునఁ బాయనై • యదబుతోడ
నిలువఁ జెలువంపు నడసొంపు • నీటుమీఱఁ
దేజివలగొని కేలను • త్రేజితారి
యతఁడు మందంబుగాఁ గంద • మప్పళించి. 28

క. సుడుల తెఱంగులు చొక్కపు
నడల బెడంగులును జాతి • నాడెంబులు నో
ప్పెడు చిన్నెలు ప్రాయమునుం
గడుకొని లెక్కించి యొక్క • గమకించుటయున్. 29

చ. కడువడిఁ జేరి డాపలిరి • కాబొకసాద కుదించిపట్ట నే
ర్పడరఁగ శాపశస్తమగు • హస్తముఁ బల్లముఁ జేర్చి యావలం
దడయక యంకవన్నెమును • దక్షిణపాదముఁ జొన్పి చంగునం
దొడరు జవంబుతో దమికి • తోడనె వీడని ప్రౌఢిమంబుతోన్.

క. కైజామోరగ నాగెలు
కైజాఱకయుండఁ గుదియఁ • గాఁబట్టి మహా
రాజాత్మజుండు తనరుచి
రాజానేయంబు నడువ • నల్లనఁ బనుపన్. 31

చ. తలఁగు తొలంగు మోసరిలు • దవ్వుల కేగుము పాయుమంచుఁ బా
యలుగ నదల్చి చూపఱుల • నాఁపుచు వేత్రధరుల్ బరాబరుల్
సలుపఁగఁ జోపుదారులు హ • సాదు పరాకని హెచ్చరింప వం
దులు సుకవీంద్రనిర్మిత కృ • తుల్ పఠియించుచు వెంటనంటి రాన్.

చ. వెలువడి దేవుడీ కెదుటి • వీధి సమేధిత వల్గు వల్గనం
బులు బలుధావనస్ఫురణ • ముల్మహితప్లుతవిభ్రమంబు లిం

పొలయఁగ ఘారితంబులు జ ♦ వోచిత రేచిత రీతు లించుకే
నలయక చిత్రచిత్రగతి ♦ నందఱు నం దరుదందఁ జూపుచున్.

సీ. మదికన్నమున్న గ ♦ మ్యముఁ జేరు బెఱఁగించు
నా మెఱుఁగారు హ ♦ డాముతీరు
మహి యంతలోనఁ ది ♦ మ్మరి క్రమ్మఱుటఁ దెల్పు
నాఁబొల్పెసంగు కా ♦ వాబెడంగు
నడఁ దనతోఁ బందె ♦ మిడఁ జీరుఁబ్రొద్దు తే
జీనాఁబొసంగు జా ♦ జీహొరంగు
సగరుత్క్రమగునాఁటి ♦ యెగురుటఁజూపున
నంగఁ జెలంగుతు ♦ లంగురంగు
పాటమాత్రంబె గంధర్వ ♦ కోటికాదవె
నటనమును గాంచితే నందు ♦ నాఁగఁ బొందు
గదుర నింపులు నింపు బ ♦ ల్లిదముసొంపు
వెలయగతి భేదములఁ జూపె ♦ విభుహయంబు. 34

వ. మఱియు సిరియురంబునందొరయు దొరకొమరుదొర నమరు తన విలాసకలాసముదయంబు జనమానసముదయనంబుగ నయనంబుల కుల్లాసంబు పల్లవింపఁజొనుప ననుపమంబగుచెన్నున నచ్చిన్నవజీరుండు చెలువారు తన వారువంబు బహువారంబు పేరెంబులు మీఱం బాఱించి యంతవారించి కతిపయపరివారంబుతో వందిమాగధవారంబు కైవారంబులు సేయ నవక్రవిక్రమారభటీ పటీయస్తములగు భటసత్తము లుత్తమంబుగ హేతిదీధితిస్తోమంబుల మెఱుంగులగు రంగులు కుఱంగటం దుఱంగలింపనిభృతనిపుణతానిబిడనిర్వికార నిర్నిద్రనిశ్శబ్దనియమంబుగా నిరుకెలంకుల నర్గమిం

వ శుద్ధాంతనిశాంతప్రాంతదంతుర దంతస్తంభ సంభాసమానాసమానాతిమానకాయమానాంతరంబునఁ దురంగావతరణం బొనర్చి తనర్చిన సముచితాచారపరిజ్ఞానంబు తేటపడ నభ్యస్యమానాయుధసాధనవ్యాయామవ్యాపార కించిత్కర్కశంబగు పాణితలంబున నీషదున్నమితపదాగ్రుండై సైంధవస్కంధప్రదేశం బల్లనల్లన నప్పళించి నిజమాతృజనదర్శనోన్ముఖుండై యుండఁ దదాత్వసమాసన్నలగు నూడిగంపు టన్నులమిన్నలు పున్నమవెన్నెలజేని కన్నఁ జెన్నలరు మోముల గోముల బడయంగోరి తారును జ్యోతిర్వహననియమంబున నోములొనర్చుగతిఁ బేర్చు నిగనిగ నెగడు మగరాలపళ్లెరంబులం గపురంపు దీపకళికలం దనహుమాయితోడంగూడ నివాళించి పంచవర్ణాక్షతసంకుల కుంకుమాంబువులు దిగదుడిచి యిరుకెలంకుల వైవ వైవస్వతమను ప్రతిమను మనుజుల మనుపుమను పురోహితహితాశీర్వాదనాదంబులకు మున్నభివాదంబు లొనర్చి యంతఃపుర సౌధాంతరంబున కరిగిన. 35

మ. ఇట మేముం బటుహేమకుడ్యఘటితా ♦ నేకక్షమానాయకో
ద్భట చిత్రప్రతిమాపటంబు వలభి ♦ ప్రాలంబమానామల
స్ఫటికోచ్చావచదీపపాత్రి ముభిత ♦ స్సమ్యక్సమాస్తీర్ణ వి
స్ఫుటచిత్రావృత రత్నకంబళమునౌ ♦ శుంభచ్చతుశ్శాలలోఁ.

వ. ఉండం గొంతవడికి. 37

సీ. గురుతర రేచర్ల ♦ గోత్రప్రథితకీర్తిఁ
రావువంశాబ్ధి రా ♦ కావిధుండు
మహితాత్మ మంగయాం ♦ బావధూరామరా
డగ్ర్యాగణ్య పు ♦ ణ్యైకఫలము

నిజసమాశ్రితమహా ♦ ద్విజసమాజకగృహాం
గణకల్పితానల్ప ♦ కల్పకంబు
ప్రాజ్యసామ్రాజ్య వై ♦ భవసమున్నతిశంసి
లసమానమహనీయ ♦ లాంఛనుండు
ధ్రువ పరీక్షిన్మహారాజ ♦ తులితలలిత
వర్ధమానగుణావళీ ♦ భవ్యశుభుఁడు
బాలభాస్కరసన్నిభ ♦ ప్రభుఁడు శ్రీకు
మారమహీపతి సూర్యరా ♦ ణ్మనుజవిభుఁడు. 38

వ. ఏతెంచి. 39

సీ. సరసనాటకకావ్య ♦ చంపూప్రబంధక్రి
యోద్దండ కవికాండ ♦ మొక్కదండ
మానాభిజాత్య స ♦ న్మానాత్మసమబాంధ
వోదార హితవార ♦ మొక్కయోర
మంజుగానవిధాన ♦ మాధురీసాధురీ
త్యురుగాయకనికాయ ♦ మొక్కచాయ
భయదాహి పరిణాహి ♦ బాహాగ్రజాగ్రదా
యుధఝూటభటకూట ♦ మొక్కచోట
స్వస్వసముచిత మర్యాద ♦ సన్నివిష్ట
మగుచుఁ దత్తద్విశిష్ట వి ♦ ద్యావినోద
సంగతిచెలంగ శృంగార ♦ భంగి నిలువఁ
జెలువు బలువైనఠీవిచేఁ ♦ గొలువు దీర్చి. 40

సీ. పరిపూర్ణతరసుధా ♦ కరముధాకరకళా
ముఖవిలాసము సిరు ♦ లొప్పదలఁజేయ

సురసాల ఫలసార ♦ సురసాలరసతుల్య
వాచారచనతేనె ♦ వానసుజీయ
సితపత్రి శతపత్రి ♦ నుతిపాత్రి నేత్రాంత
వీక్షణంబులు గృప ♦ వెల్లిగొలుపఁ
గలశాంబునిధిగర్భ ♦ తలనిర్భరోర్మికా
నిర్మలస్మితను వె ♦ న్నెలలుగాయ
రాజసముగులుగ శృంగార ♦ రసము చిలుగ
నిరుపమానందకందళ్లో ♦ న్నిద్రిహృదయ
మమరె నమరాధిపతి వైభ ♦ వము దలిర్ప
నిష్టసల్లాపలీలచే ♦ నెసఁగుచుండ. 41

సరసాటోపకళానురూపకవితా ♦ సంగీతసాహిత్య భా
స్వరసల్లాపము కాలయాపనమొ ♦ నర్పం గోష్ఠిఁ గావించుచో
స్థిరకీర్తిస్థితిహేతువెద్దియని యా ♦ సీనుల్ ప్రశంసించినన్
జిరునవ్వాననచంద్రువెన్నెలయనం ♦ జెన్నొందనన్నందులోన్.

హితు శ్రీరామకృపాకటాక్షజనితా ♦ నేకావధానాంధ్ర సం
సృృతభాషాశతలేఖినీకవన ని ♦ ర్ణేతృత్వముఖ్యక్రియా
ప్రతిభుం దేవులపల్లివంశభవు సు ♦ బ్బారాయసూరిం బ్రస
న్నత వీక్షించి వచించె నిప్పగిదిఁ బూ ♦ ర్ణప్రీతి సంధిల్లఁగన్.

హృద్యతర సత్తసంతా
నోద్యమములయందు నెందు ♦ నొందును జిరభా
స్వద్యశము నరుఁడు దానిం
బ్రద్యోతితఫణితిఁ దెల్ప ♦ వలె మీరనినన్. 44

మ. వసునిక్షేప సురాలయక్షితిసుప ♦ ర్వస్థాపనారామకూ
పసరష్షట్క మొకానొకప్పుడు సమా ♦ ప్తంబైనగా తారకేం
దుసహస్రాంశువుగా యశంబు గృతినుం ♦ డుం ధాత్రిసాభోగభో
గసుఖశ్రీవిభవంబులుం గలిగెడుం ♦ గాయుంచు నేఁ బల్కినన్.

క. కృతిఁ గైకొనవలెనను స
న్మతి మనమునఁ బొడమ సరస ♦ మాధుర్యయుత
స్మితపూర్వక నుతిధూర్వహ
హితభాషణభూషణముగ ♦ నిట్లని పలికెన్. 46

సీ. విఖ్యాతనాటక ♦ వ్యాఖ్యానవిరచనా
గరిమంబు వైదికా ♦ గ్రణులదండ్రు
శృంగారసారసం ♦ స్కృతభాణనిర్మాణ
యమకంబు వైష్ణవో ♦ త్తములదండ్రు
ప్రథితాంధ్రభాషాప్ర ♦ బంధ బంధురకవి
త్వప్రౌఢిమ నియోగి ♦ వరులదండ్రు
చాటుధారాపద్య ♦ సంధానవిజ్ఞాన
పటిమంబు మాగధ ♦ వరులదండ్రు
గాని యిన్నివిధంబులఁ ♦ గవితఁ గూర్చ
నేరుపరి నేర్పరించుచో ♦ మీరలొకర
రరయ వరయత్నమునఁ జేర ♦ రొరులు మాకుఁ
బ్రాజ్యరాజ్యంబుతోఁ బాటి ♦ వారలగుట. 47

సీ. ఒకచోట వికచాబ్జ ♦ మకరందలహరికా
మాధుర్యరసపుష్టి ♦ మహిమ దనర

నాకవంక నకలంక ♦ సుకుమారపదగుంభ
దనవద్యవైశద్య ♦ మొనరుచుండ
నాకతావున సమర్థ ♦ సుకరార్థగుంభనో
జ్జృంభణప్రౌఢిమం ♦ జేపుమీఱ
నాకక్షేత్రవ నురుభావ ♦ నికరావబోధకా
గణ్యనైపుణ్య మా ♦ ర్గము సెలంగ
లలితకవితాచమత్కార ♦ లసదనల్ప
కల్పనాకల్పచాతురి ♦ గానుపింప
నాకక్రైఁ సరసప్రబంధంబుఁ ♦ జోకక్రైమైన
ఫణితిఁగావింప భావింప ♦ వలెనటంచు. 48

గీ. లోకమున లోకులెల్ల సు ♦ శ్లోకఫణితిఁ
బూర్వసుశ్లోక కల్యాణ ♦ ములను గృతులు
కృతులు గావించి యొసఁగ న ♦ తత్కృతులొనస్త
రదియు సంపత్కరంబె యా ♦ నంతకంటె. 49

క. జననీజనక కథాశ్రుతి
యనఘంబని తోఁచుఁ గాన ♦ నస్మజ్జననీ
జనకుల వైవాహికకథ
వినవలతుం దెలుపు మార్య ♦ విశ్రుతచర్యా. 50

చ. అన విని తొల్లి యొకక్రసమ ♦ యంబున నే వినయంబుతోడ మ
జ్జనకునిపజ్జ సజ్జన క ♦ థాశ్రవణం బొనరించుపట్లఁ బా
వనుఁడగు నస్మదీయ నర ♦ పాలుని పెండిలి బొప్పుఁ జెప్పఁడీ
యన వినుపించె నెప్పగిది ♦ నప్పగిదిన్ వినుపింతు నంతయున్.

గీ. అనినఁ గౌతూహలం బాత్మఁ • బెనఁగొనంగ
నంగజగురూపచార స • క్తాంతరంగ
రంగదురుతరకారుణ్య • రసము భాతి
భాతి విశదస్మితద్యుతు ల్పరఁగ నన్న. 52

మ. వరఘాటీచరఘోటికాపటల భా • స్వత్స్వర్ణశాటీసము
త్కరపేటీ ధనకోటికా లసదలం • కారప్రసూనావళీ
సరపాటీర రసాంచితైణమదచ • ర్చాపూర్వకానేకస
త్కరణశ్రీపరిపాటి వీడ్కొలుప ను • త్సాహంబు వాటిల్లఁ గన్.

మ. ఇల మర్త్యాంకకృతిన్ రచింపఁదగదం • చెల్లెంతు వాల్మీకి ము
ఖ్యులు నా శ్రీహరినైన మానవుఁడుగా • నుండంగఁ గాదే నుతిం
చి లసద్గౌరవులైరి మత్కృతిపుఁడౌ • శ్రీసూర్యరాడ్భూపమం
డలవర్యుండును దేవతావరజ జ • న్మశ్రీయె యంచున్ మదిన్.

క. ధనమొసఁగినఁ జనువొసఁగరు
చనువొసఁగిన మనమొసంగఁ • జాలరు మనసి
చ్చిన గారవింప రితరులు
గన నిన్నియు నొసఁగుచుండెఁ • గద యితఁ డనుచున్. 55

## షష్ఠ్యంతములు

క. ఏవంవిధ శుభలాంఛన
భావంగమ నిత్యసత్య • వర్తనలీలా
భావుక రావుకులాఖ్య ధు
నీవర చంద్రునకు శౌర్య • నిస్తంద్రునకున్. 56

క. రేచర్లగోత్రభవ గో
త్రాచక్రప్రభవ పూర్వ ♦ రాజలలామ
శ్రీచరిత రామరాయనృ
పాచరిత తపఃఫలాయి ♦ తాభ్యుదయునకున్. 57

క. భాసుర వెల్లంకికులో
ద్భాసి జగన్నాథరాయ ♦ పార్థివసంతా
నాసమవైభవ మంగాం
బా సాధ్వీగర్భశుక్తి ♦ మౌక్తికమణికిన్. 58

క. అనుపమతర గురుభృగునం
దనమను చాణక్యముఖ్య ♦ నయపద్ధతి ఖే
లనవర్తిష్ణునకు జనా
వనవిష్ణునకును శతాబ్ద ♦ వర్ధిష్ణునకున్. 59

క. కమనీయ పద్మనాయక
సముదయసంభావితాభి ♦ జాత్యాదిగుణో
త్తమ రావు వేంకటకుమా
రమహీపతి సూర్యరాయ ♦ రాజేంద్రునకున్. 60

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనరింపంబూనికొనిన రామ
రాయవిలాసం బను ప్రబంధమునకు మజ్జనకుండగు వేంకటకృష్ణ
శాస్త్రివరేణ్యోక్తక్రమంబగు కథోపక్రమం బెట్టులనిన. 61

శా. శ్రీమించున్భువిఁ బీఠికాపురము ల ♦ క్ష్మీపాదమంజీర శిం
జామంజుస్వన విభ్రమ భ్రమకరా ♦ సంఖ్యార్థ సంఖ్యానము

ద్రామందోదిత ఘూళగళ్య రవస ♦ మ్యక్షూచి తైశ్వర్య యు
క్ష్మామంతామితదివ్యభవ్యభవనా ♦ శ్రాంత ప్రభాక్రాంతమై. 60

క. ఆనగరి సౌధయూథము
లానగరిపు నగరిదెంత ♦ యనిన గురుచిరం
బైన గురుత్వమున సుధా
శ్రీనగురుచి కలిమిఁ గ్రిందు ♦ సేయుచు నెపుడున్. 61

సీ. ఎలమిచే శ్రీకుక్కు ♦ టేశ్వర శ్రీకుంతి
మాధవస్వాములే ♦ మరనిచోటు
హితమూని రాజరా ♦ జేశ్వరీ పురుహూతి
కాశక్తు లభివృద్ధి ♦ గఱుపుతావు
గడఁగి యేలామహా ♦ కల్లోలినిసతంబు
నెసఁగి చుట్టును బ్రవ ♦ హించు నెలవు
ప్రతిన వట్టినరీతిఁ ♦ బాద గయాక్షేత్ర
మోపి పిత్ర్యాణము ♦ ల్వాపుమనికి
మఱియునెల్లెడ నాల్గు సీ ♦ మలకు నడుమఁ
దరిసి మున్నూఱు నఱువది ♦ దైవతములు
గృపను రాజేంద్రునకు జయం ♦ బిచ్చు చక్రి
విభవ శుభవృద్ధి కరము శ్రీ ♦ పీఠపురము. 62

శా. ఆకైలాసకు భృద్విహారకలనా ♦ వ్యాసంగ రంగిత్వమున్
శ్రీకాశీపుర వాసలాలసమతి ♦ స్థేమత్వమున్ భూమమై
యేకీభావమునొందఁ గుక్కుటఖగా ♦ ధీశాకృతింబూని గౌ
రీకాంతుండు వసించు పీఠపురి వ ♦ ర్ణించంగ సామాన్యమే. 33

శా. ఖ్యాతశ్రీఁ ద్రిజగత్ప్రభూత మహిమం • బౌ కుక్కుటేశాకృతి
జ్యోతిర్లింగము చుట్టుఁ బావనముగ • వ్యూతిక్షమా భాగమా
పాతాళంబుగ నంచునంచితమతిం • బ్రాజ్ఞుల్ ప్రశంసింతురా
పూతక్షేత్రముపీఠికానగర మొ • ప్పున్ యామ్యదిక్కాశినై 64

సీ. దుర్భిక్ష హర్యక్షు • దుర్వార శరభంబు
వైరివారిదవార • మారుతంబు
నాపదంధతమసా • హరణ ప్రభాతంబు
పాపమత్తేభేంద్ర • పాకలంబు
విజ్ఞాన చంద్రికా • విలసనేందూదయం
బైశ్వర్యవనవసం • తాగమంబు
ఘనపుణ్య సస్యరా • శ్యనుకూల వర్షంబు
ముక్తి కన్యోద్వాహ • ముఖ్యలగ్న
మచటి కరుదెంచు జనులక • యత్నసిద్ధ
ఫలము శ్రీకుంతిమాధవ • స్వామి దివ్య
మందిర విమానదేదీప్య • మానవిపుల
ధామ ధామసుదర్శన • దర్శనంబు. 65

మ. శ్రవణానందముగాఁ దగున్మధురిమ • ప్రాగ్భారధారాళసం
స్రవణామందమరందబిందులహరీ • సందోహ సంక్రీడన
ప్రవణాళి ప్రవరాళి గానభణితు • ల్వృచ్ఛాయశీతాతతా
మ్రవణాళిందములందుఁ గ్రుందుకొనిస • మ్యగ్రీతినేలాతటిన్. 66

మ. ఉపశల్యంబుల నెల్లెడందనరుఁ గు • ల్యాఘౌఘ సంవర్ధితా
నుపమానేక్షువణద్విరేఫలలితా • నూనప్రసూనప్రతా

నపరీతోపవనంబులం గజూఁడుగి • నక్రంగాము కాళీజయా
ర్థపరుండై ఘటియించు నక్షయధను • ర్జ్యాబాణగేహంబులై. 67

మ. సౌలపౌగంధవహార్భకంబులు చరిం • చున్ సంజలన్వీటి వీ
థుల శ్రీమాధవదేవుదేవళపుఁ బూఁ • దోఁటం గుబాళించు పూ
వులయుంబుష్కరిణీనలంబులయుఁ దా • వుల్ పూని యప్పుష్పలా
వులవెంటం భృతికేగు నైవధికులుం • బోలెంగ దున్మందమై. 68

క. ఇహమిడ నేలా నదియై
బహుళంబగు పరమిడంగ • భాగిరథియై
మహిమహితమహిమ చేఁదగు
నహహా! మందాకినీ మ • హానదియెరహిన్. 69

సీ. ఛందోనురూపతఁ • జర్చింపఁగానేల
యరయ నందఱు విప్ర • వరులనంగ
వచన ప్రగల్భతా • రచనఁ దెల్పఁగనేల
కనఁగ నందఱు ద్విజా • గ్రణులనంగ
యాగక్రియోద్యోగ • యోగ మెంచఁగనేల
తెలియ నందఱు బుధా • ధిపులనంగ
జ్యోతిర్విభూతి వి • ఖ్యాతి నెన్నఁగనేల
తలప నందఱు బాడ • బులెయనంగఁ
గానిచో నెట్లు వినతాధి • కప్రహర్ష
ణంబ నంతసమాఖ్యావి • డంబనంబు
ననిశసన్మార్గ వర్తనం • బతి శుచిత్వ
మనఁగఁ దనరుదు రెల్ల బ్రా • హ్మణులు వీట. 70

మ. విలసత్పూర్ణకళాప్రతాపయుతము ♦ ల్విశ్వోల్లసల్లక్షణో
జ్జ్వలరేఖాకరరాజమానములు స ♦ చ్చక్రావనప్రక్రియా
కలితస్వాంతసమంచితంబులయి పేఁ ♦ కన్రాజమార్తాండమం
డలముల్రెండుగ నప్పురోత్తమమున ♦ న్రాజిల్లు రేయుంబగల్. 71

సీ. ఏచాయఁ జూచిన ♦ శ్రీచారురుచిరము
క్తాచాకచక్యప్ర ♦ భాచయంబు
లేవైపు దిలకింప ♦ భావైకరమణీయ
భావైణలాంఛన ♦ గ్రావసితము
లేమేరఁ గనుఁగొన్న ♦ గోమేధికాశ్మక
స్తోమేధితోద్దామ ♦ ధామయుతము
లేలోన వీక్షింప ♦ నీలోపలద్యుతి
జాలోదితాతిత ♦ మోలలితము
లౌచుఁ గనుపట్టు విడిమట్టు ♦ లలరగట్టు
విలుతు చెలిపెంపు తమసొంపు ♦ గలగడింపుఁ
దనమునకు సాటిఁ గనదేటిఁ ♦ గనుచుమాటి
కినినగును వాటపుఁ గిరాట ♦ జనము వీట. 72

గీ. తతసమృద్ధిశాలి ♦ తాస్ఫూర్తి చేఁ గాంచు
భూరిశూద్రరీతిఁ ♦ బోలుపు మించి
తతసమృద్ధిశాలి ♦ తాస్ఫూర్తి చే నొప్పు
భూరిశూద్రరీతి ♦ పొసఁగు వీట 73

గీ. పురజయాంబుధి మథనావ ♦ సరములందుఁ
దమ్ముఁ దాల్చిన వారికృ ♦ తమ్మెఱింగి

మఱల భరియించు నలమేరు • మందరములు
నాఁగ శివ కేశవుల స్యంద • నమ్ములలరు. 74

శా. ఏకాంగంబగు మానుఁ జక్రము తదీ • యైకాభిధామాత్రిన
స్తోకఖ్యాతి సుదర్శనంబు రుసమి • ద్భూయస్సముద్యజ్జయో
ద్రేకంబౌనఁట తాదృశాంగ శతవ • ద్దింగాంచు నస్మజ్జయ
శ్రీకిన్ మేరగలాదె యంచుఁ బురివ • ర్తించున్ శతాంగచ్ఛటల్. 75

ఉ. కొండలు తత్పురింగరుల • కన్ సరివచ్చునె వానికెంతగా
నుండిననుండుగండములు • నుండినఁ బాదములుండుఁ గాకిటు
ల్నిండగు దానహస్తములు • లేవుగదా యని స్వామిభృత్యులే
పొండిపి సార్వభౌమకుల • భూషణముల్ పరికించి చూడఁగన్. 76

క. సతతము తన్నగరంబున
నతులితగతి చాతురంతి • కాదితురంగ
ప్రతతు లలరారు జనస
మ్మత కంఠాభరణరోచ • మానములగుచున్. 77

చ. పిడుగుల తునకలన్నగరి • వీరభటచ్ఛట లట్టుకానిచో
బెడిదముగాని జేంద్రశర • వృష్టికి మున్నగ శత్రుగోత్రముల్
పొడిపొడిగాఁగడున్వడి గు • భుల్లుభులంచును గర్జితధ్వనుల్
గడలుకొనం బయింబడి జ • గద్భయదార్భటి నేపుఁ జూపునే. 78

మ. నగరింగల్గు శిరోగృహంబులకు స్వ • ర్ణశ్రీపటిష్ఠంబులై
తనుటం గాదు స్వజాలమార్గముల నం • తఃపారిప్లుఁ జైనట్టిశీ
తగభస్తిన్ గ్రహియింపఁగాఁదలువులం • దత్రత్యకాబాలిక
ల్బిగియించంగ నతండు నిల్వనిలఁబ • ర్వెంజంద్రశాలాభిధల్. 79

సీ. ప్రాకారములుసుధీ • ప్రాకారములు బహి
ర్గోపురంబులతీత • గోపురములు
కాసారములు సూర్మి • కాసారములు సౌధ
జాలకంబులు రత్న - జాలకములు
చతురంగములు మహా • చ్చతురంగములు రాజ్ఞి
కేతనంబులు బద్ధ • కేతనంబు
లారామములు సత్ఫ • లారామములు తత్స
భాజనములు ధర్మ • భాజనములు
జగతినలసప్తనగర రా • జగతిమిగుల
నెన్నిపురులొప్పనన్నిటి • నెన్నితనరు
భావనాతీత దివ్యప్ర • భావనాశ్రీ
కాపురంబు జయేందిర • కాఁపురంబు.

ఉ. ఆనగరావతంసము స • మగ్రభుజోగ్రతరప్రతాపవై
శ్వానరకీలజాలశల • భాయితశాత్రవుఁడాశ్రితేష్ట సం
ధానచణుండు రావుకుల • నాథుఁడు సూర్యనృపాలుఁ డేలు ము
న్నీనవఖండమండిత మ • హీతలముం బృథుచక్రవర్తినాన్. 81

చ. చదువులఁబ్రోడ, సాములను • జాణ, గానంబులసుప్రసిద్ధుఁ డ
భ్యుదయములందనుద్ధతుఁడు • యుక్తవచస్స్ఫురణంబునందు బ
ల్లిదుఁడు స్వకార్యసిద్ధినవ • లేపవిహీనుఁడు దీనకోటిపై
సదయుఁడు రావుసూర్యనృప • సత్తముజోడగుఱేఁడులేఁడిలన్. 82

సీ. ప్రజలఁగన్నను గన్న • ప్రజలకన్నను మిన్న
గాఁగావఁగాఁజూచు • కారుణికుఁడు

వసుమతి నేర్పుమై ♦ వసుమతియగు నట్లు
పరిపాలన మొనర్చు ♦ పార్థివుండు
బంధులఁ బ్రేమాను ♦ బంధులఁగా వించి
మన్ననఁబచరించు ♦ మానఘనుఁడు
భటసమూహము సము ♦ ద్భటసముత్సాహమై
తనరఁబోషించు ప్ర ♦ తాపశాలి
కలఁడె యీదృశసాద్గుణ్య ♦ గణ్యుఁడైన
నృపశిఖామణియంచు వ ♦ ర్ణింపనెసఁగి
రావు వేంకటనీలాద్రి ♦ రాయవిభుని
సూర్యరాయేంద్రుఁడలరెని ♦ స్తులనిరూఢి. 83

క. నిండిన చెఱువులు మెండుగఁ
బండిన పైరులును బుష్ప ♦ ఫలభరితములై
యుండిన తోఁటలునై సన
యుండిల నతఁడేలురాష్ట్ర ♦ మొప్పగునెపుడున్. 84

సీ. నెలనెలమూఁడు వా ♦ నలుగ వర్షించును
వలసినంతగ వారి ♦ వాహచయము
కడుసమృద్ధముగ నె ♦ ప్పుడుఁ బాఁడిమొదవులు
విసువుఁ జూపక పాలు ♦ విదుకనిచ్చు
నుర్వీతలంబెల్ల ♦ నుర్వరాసంజ్ఞచే
సర్వకాలముశోభ ♦ పర్వియుండుఁ
బౌరజానపదాది ♦ పూరుషవ్రాతంబు
నన్యోన్య మైత్రిచే ♦ నలరియుండు
నఖిలదేశంబు నిత్యక ♦ ల్యాణమగుచుఁ
బచ్చతోరణముగను జూ ♦ పట్టుచుండు

రావు కులమణి శ్రీసూర్య • రాయవిభుఁడు
పాడిమీఱంగఁ బ్రజలఁ గా • పాడునపుడు. 85

గీ. కొలుచు ప్రజలకుఁ దగినంత • కొలుచుఁగూర్చి
కొట్టడంబులఁ బెక్కేళ్ళ • కనుసమాప్తి
నొందకుండంగ నిల్వఁగా • నునుచునతని
దేశమున క్షామమొదవునే • లేశమైన. 86

క. ఋణముల శతాంశవృద్ధిగ
వణిజులకుఁ గృషీవలులకుఁ • బ్రజలకుఁ నిడిరా
ణ్మణియతఁడు ప్రోవఁగా బహు
గుణముగ సంపదలు ధాత్రిఁ • గొమరుతలిర్చెన్. 87

ఉ. ఆఁడడు ప్రల్లదంబులనొ • కప్పుడు నెవ్వరినైనఁ గూళలం
గూడఁడు కర్జమందయినఁ • గోవిదకూటముతోడి కూటమిన్
వీడఁడు సర్వకాలమును • వేఁడిన యర్థమొసంగికాని పోఁ
జూడఁడుదీనమానవుల • సూర్యనృపాలుఁడు రాజమాత్రుఁడే. 88

శా. చాతుర్వర్ణ్యముస్వస్వధర్మనిరతే • చ్ఛన్మించఁగానంగనల్
పాతివ్రత్యమునం బ్రవర్తిలఁగ దే • వబ్రాహ్మణాచార్య సే
వాతాత్పర్యమునం బ్రజల్మెలఁగ భూ • పశ్రేష్ఠుఁడాతండు వి
ఖ్యాతింభూతలమేలెధర్మమునెలం • గన్నాల్గు పాదంబులన్. 89

గీ. తల్లి భావయాంబ • తమ్ముఁడు శ్రీకుమా
ర మహీపతి సమాఖ్య • రాజమౌళి
యకట సదయహృదయ • యైన లక్ష్మి వెంక
యాంబ హితముఁ జూప • నతఁడెసంగె. 90

శా. ఆగోత్రేంద్రుఁడు చింతపట్లకులజుం ♦ డైధాత్రివిఖ్యాతుఁడా
శ్రీగంగాధర రామరాయ విభుపు ♦ త్త్రిం దేవిగాఁ గైకొనెన్
శ్రీగాంభీర్యధృతిక్షమావినయ సౌ ♦ శీల్యాదశుంభద్గుణ
శ్రీగేయన్వర వర్ణినీమణిని ల ♦ క్ష్మీవెంకయాంబాసతిన్. 91

చ. చెలువుఁడు దైవతంబనుచు ♦ సేవకులాత్మజులందు నత్తమా
మలు గిరిజేశులంచువిభు ♦ మంత్రులు నాప్తులు నెన్న నన్నద
మ్ములనుచు నెమ్మిమీఱసమ ♦ బుద్ధిని జూచుచుఁ బ్రోచునవ్వధూ
తిలకముసాటిబోఁటి కల ♦ దే యిలదేశములందునెందులన్. 92

సీ. రాచకర్జములనా ♦ లోచించు పట్టునఁ
బ్రతిభమైనీతి మ ♦ ర్మములఁ దెలుపు
సకలోపచారము ♦ ల్సవరించునప్పుడు
నడఁకువతోఁ దానె ♦ యుపచరించుఁ
దఱివేచి యెప్పొద్దుఁ ♦ దరిసిల్చి యోరెంబు
లింపుగాఁ దానెభు ♦ జింపఁజేయు
నొండొక్క వేళల ♦ న్యూనాధికతఁ జూపఁ
దన్నుఁగాదనుచుక్షాం ♦ తత్వ వహించు
లలిత సౌందర్యవిభ్రమం ♦ బులను నెఱపు
నెల్ల సౌఖ్యంబులను దని ♦ యింపఁజేయు
ధరణిషడ్విధకులవధూ ♦ ధర్మములకుఁ
బుట్టినిల్లయి యవ్విభు ♦ పట్టమహిషి. 93

క. ఆపట్టమహిషియందా
భూపతిగనెసుతచతుష్క ♦ మునుసుత వెనుకన్

స్త్రీపురుషాపత్యద్వయ
రూపమహాభాగ్యభోగ ♦ రూఢిఁదలిర్పన్. 94

సీ. అందగ్రసుతుఁడు స ♦ మగ్రతేజశ్శాలి
నీలాద్రిరాయ భూ ♦ పాలమౌళి
రెండవసుతవరే ♦ ణ్యుండు గంగాధర
రామరాయక్ష్మా ♦ రమణమణియు
నాతని పిదపను ♦ ద్యత్కీర్తి విస్ఫూర్తి
వేంకటరాయప్ర ♦ ధ్వరుండు,
నతవిపెనక్సుశౌర్యుఁ ♦ డగు సూర్యనారాయ
ణప్రకాశావనీ ♦ నాయకుండు
నందఱకుఁబెద్ద శ్రీభావ ♦ యాంబికయును
సాటిగనరాని ముద్దుము ♦ చ్చటలఁజూప
నమ్మహారాజ దంపతు ♦ లెమ్మెమీఱ
ధరణి విలసిల్లి రానంద ♦ భరితులగుచు. 95

ఉ. అందఱు ముద్దుముచ్చటల ♦ నాటలఁబాటలఁ దెల్విఁతేటలన్
సందడిమీఱఁగాఁ జదువు ♦ సాములఁ గోములఁ జూచువారికే
డెందములందు మోదము ఘ ♦ టించుచునుండఁగఁదల్లిదండ్రులా
నందమునొంది వర్తిలి ర ♦ నన్యలెనాతులనాతిగస్థితిన్. 96

ఉ. స్యందనభేదయానముల ♦ సామజభూమజవాశ్వయానమం
దందము గాఁగనందలము ♦ లందులఁబొందిరవొందనెక్కియు
స్పందగతిం జరించునెడ ♦ చందమునందన నందనుల్నుతిం
జెందఁగనొందెనన్నృపతి ♦ చిత్తమునందునమంద మోదమున్. 97

క. నందనబృందంబిట్లుగ
నందనడెందమున కెంపు • నాటింపఁగ సం
క్రందననిభుఁడతఁడుదశ
స్యందనవిభుచందమితని • దనఁదనరారెన్. 98

క. ఆవిభుపిమ్మటభూసతి
దావసియింపఁగఁ దలంచెఁ • దత్సుతవర్యం
డైవెలసి యెల్లగొనముల
ప్రోవగు నీలాద్రివిభుని • భుజపీఠమునన్. 99

క. అంతటఁ దదనంతరమున
నెంతయుఁ బంటలవలంతి • యింపలరఁగ ధీ
మంతుని సామంతుని శ్రీ
మంతున్ శ్రీరామరాయ • మణివరియించెన్. 100

సీ. ఆతండు రెండవ • యవతారపురుషుండు
కాఠిన్యమింతైనఁ • గనియెఱుంగఁ
డాతండు సౌకర్య • మతిశయంబుగఁ జూపుఁ
బంకసంకీర్ణభా • వంబుఁ జూపఁ
డాతండహీనుఁడై • ఖ్యాతిచేఁ జెలువొందుఁ
గుటిలసంచారమె • చ్చటను దాల్పఁ
డాంతండు భూభృత్కు • లాగ్రణియై మించు
గండమెన్నండు నా • కిటియుఁ గనఁడు
మఱియు నాతండు సార్వభౌ • మత్వముఖ్య
చిహ్నముల నొప్పు మదవృత్తి • చేనెసంగఁ

డట్టి నిర్దుష్టగుణుచెట్టఁ ♦ బట్టవలదె
యనుచు వసుమతి రామరా ♦ యనివరించె. 101

ఉ. జక్కులచేనిపట్టినెక ♦ సక్కెము లాడఁగఁ జాలునట్టి బల్
చక్కఁదనంబువాఁడతఁడు ♦ సాహసలీలల విక్రమార్కునిన్
ధిక్కృతిఁజేయఁజాలువర ♦ ధీగరిమన్గురుమించనోపు స
ద్వాక్కులవాయుభుక్కులవ ♦ తంసమునెన్నఁగ నేర్చుఁబోల్పఁగన్.

ఉ. ఒక్కరుఁడుక్కునన్మఱియు ♦ నొక్కరుఁడక్కటికంబునందువే
రొక్కఁడు బల్మికల్మియుగ ♦ మొక్కని కొక్కటిగాఁగఁగీర్తిపెం
పెక్కుడు వక్కజక్కిదొర ♦ యొక్కటియైమనురామసంజ్ఞచే
నిక్కలిరామరాయధర ♦ ణీశ్వరుఁడై తనరారెనన్నిటన్. 103

ఉ. పెక్కువిధంబులందొడరి ♦ బీదలసాదల సాదరాత్ముఁడై
జక్కఁగఁ బ్రోదిసేయఁగల ♦ జాణతనంబున నిట్టిధార్మికుం
డెక్కడఁ గానరాఁడనుచు ♦ నెల్లజనంబులు నుల్లసిల్లఁగా
మిక్కిలి చేర్చెనాతఁడొగి ♦ మేదిని మోదినియై చెలంగఁగన్.

క. తన తమ్ముఁడొకఁడు బొబ్బిలి
యను ఘనమగు రాజధాని ♦ కధిపతిగాఁ దై
కొనఁబడుట నితరసహజుం
డును దానును గలసితగు జ ♦ నుల్గొనియాడన్. 105

క. తనతమ్ముని వేంకటరా
యనిఁ దనపినతండ్రితనయు ♦ లగు సూర్యారా
యని ధర్మరాయనిఁ గడు
ననురాగము దనరఁ దనుపు ♦ ననవరతంబున్. 106

ఉ. తమ్మునితాంతముం దనదు ♦ తమ్మునివేంకటరావుఁబోలెఁ జి
త్తమ్మున సమ్మదమ్మునియు ♦ తమ్ముఁగఁ గ్రమ్మఁగఁ జూడ బంధుజా
తమ్ములు సంతసింప సత ♦ తమ్మును ధర్మనృపానుజన్ము పే
తమ్ముగ సూర్యనేతవిది ♦ తమ్ముగ భక్తి భజించు నవ్విభున్. 107

సీ. దేశదేశాగత ♦ ద్విజవరేణ్యుల కెల్ల
వినయంబుఁ దొలుకద ♦ ర్శన మొసంగి
తత్తదభ్యస్తవి ♦ ద్యాప్రసంగంబుల
వినువేడ్కఁదనరఁగా ♦ వింపఁజేసి
ప్రతిభావిశేష సం ♦ పదసొంపు వాటింపఁ
గలయానందలి సార ♦ ముల గ్రహించి
యేరీతినెవరి స ♦ త్కృతులఁ దన్పఁగ నొప్పు
నారీతివారల ♦ గారవించి
పుడమినాతఁడు నవకళా ♦ భోజుఁడనుచు
దిక్కుల యశంబు చొక్కమై ♦ నెక్కొనంగ
వెలసి విలసిల్లె శ్రీరావు ♦ కులపయోధి
తోయజాతారి శ్రీరామ ♦ రాయశౌరి. 108

క. శ్రీకరుణారస పూర్ణా
లోకనసంవర్ధితార్థి ♦ లోకస్తవనా
ధీకనదాకైశోర
స్వీకృత బహుకవికృతప్ర ♦ సిద్ధసుకవనా! 109

మ. లలితప్రాభవ రాజరాజనికర ♦ శ్లాఘ్యక్రియాకల్పక
ల్పలతా వాక్కలఘాత ఘాతకిరణ ♦ స్ఫాయద్యశస్సారసా

రలసద్రావు కులీన లీన రిపు భూ • రాడ్గర్వ సర్వస్వవ
స్వలఘుశ్రీయుత ధామధామజిత సూ • ర్యాసూర్యరాయాధిపా.

స్రగ్విణీవృత్తము. దీనరక్షావ్రతా • ధీనధీరాజితా
దానకేళీహితా • ధర్మకర్మోచ్ఛ్రితా
మానవాఘుస్తుతా • మాధవార్చారతా
మానితార్యాశ్రితా • మంగయాంబాసుతా. 111

గద్య. ఇది శ్రీరామచంద్ర కృపాసాంద్ర కటాక్ష నిరీక్షణ సంలబ్ధ
శతావధానాది సరసతరకవితావిచక్షణ శ్రీమత్కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లి కులపయఃపయోనిధి కళానిధి సీతారామ
శాస్త్రి పౌత్త్ర వేంకటకృష్ణశాస్త్రి పుత్త్ర తమ్మనాభి
ధానాంతర వేంకటకృష్ణశాస్త్రి నామాగ్రజన్మ
త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బరాయ
నామధేయ ప్రణీతంబైన రామరాయ
విలాసంబను ప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.





శ్రీరస్తు.

శుభమస్తు, అవిఘ్నమస్తు.

# రామరాయవిలాసము.

## ద్వితీయాశ్వాసము.



పద్మనాయకాన్వయ
దీపక రేచర్లగోత్ర • వృషరాపుకుల
శ్రీపద్మవనవికాస
పాత్రిపణ కృతి సూర్యరామ • రాయనిసూర్యా.

గీ. అవధరింపు మహారాజ • సావధాన
వృత్తిగాఁ జిత్త మిగురొత్త • నిత్తెఱఁగున
రహిఁ భవజ్జనకుఁడు రామ • రాయవిభుఁడు
లలిత యౌవన సౌందర్య • కళ నెసంగ.

క. అతనికిఁ గులవృద్ధుల స
మ్మతిని బితృవ్యుఁడు గుమార • మహిపతిరాయ
క్షితిపతియుఁ బితామహియును
బితృభగినియుఁ బెండ్లిసేయ • వేడుకలొడన్.

మ. ఒకసౌధాంగణసీమనొక్కతఱి బం ♦ ధూత్తంసముల్గొల్వ ను
త్సుకతం గాంచన రత్నపీఠికల నిం ♦ తుల్వీవనల్వీవ ని
ష్టకథాగోష్ఠుల ముచ్చటించుకొనుచున్ ♦ సంతుష్టిమైనున్న చో
స్వకులస్త్రీపురుష ప్రకాండముల యు♦ద్వాహప్రసంగంబు రాన్.

చ. మనయవతారమూర్తికి స ♦ మంచితకీర్తికిఁ గీర్తనీయ వ
ర్తన మహనీయ సంపదభి ♦ రామరమారమణీయ లక్షణం
గన నిరువంగడంబులకుఁ ♦ గ్రన్నన వన్నెయుఁ దెచ్చుకన్నెయుం
బనుపడఁ గూర్పఁగాఁ దగిన ♦ ప్రాయమిదే యనుకొంచునుండఁగాన్.

సీ. కొత్తపెంపునకుదూఁ ♦ కొనుచున్న నెఱికురుల్
దిరుచూర్ణరేఖపైఁ ♦ దుఱఁగలింప
సొబగారు నూనూఁగు ♦ సోగమీసపుఁగొనల్
చెక్కుల మిసమిస ♦ ల్చక్కఁజొనుప
గాంభీర్యసారంబు ♦ కారుణ్యపూరంబు
దెలితళుక్కులొలుకు క ♦ న్నులను దోఁప
నడలందునుడులందు ♦ నడరొందు నందంబు
నెఱజాణతనపుఁ బొం ♦ దికను జూప
నిండుజవ్వనపుంగల్మి ♦ నివ్వటిల్లఁ
జెలఁగు నలరామరాయేంద్ర ♦ శేఖరుండు
వృద్ధజనముల దర్శించు ♦ బుద్ధినుచిత
పరిజనముగొల్వ నచ్చోటి ♦ కరుగుదెంచె. 6

ఉ. వచ్చుచునున్న రాకొమరు ♦ ద్వారసమీపమునందె కాంచి ము
న్నచ్చట నున్న బంధుజను ♦ లందఱు గ్రక్కున లేచి నిల్వఁగా

మచ్చిక దోఁచు చూపులను ♦ మన్ననఁ దెల్పుచు నిల్చి వృద్ధులం
జెచ్చెర డాసి చెంగటను ♦ జేతులు మోడ్చి వసింపనింపుతోన్. 7

గీ. తండ్రి ! రావోయి ! మాయవ ♦ తారమూర్తి
యనుచు మనుమని కేల్సాపి ♦ ననుచుకూర్చి
గదుర ముదుసలి యవ్వ డ ♦ గ్గఱఁగఁ బిలిచి
శిరము మూర్కొని తగుపీఠి ♦ నిరవుకొల్పె. 8

గీ. వేయి సంవత్సరములు నీ ♦ కాయువయ్యా !
యిప్పుడిదె నీదు మాటలె ♦ చెప్పికొనుచు
నుండఁగా వచ్చితివి తన్ను ♦ నొరులు తలఁచు
నంతటనె వచ్చునతఁడు దీ ♦ ర్ఘాయువుగద ! 9

క. అనవిని యతండు మీరలు
ననుఁగోరిచి ముచ్చటించి ♦ న ప్రసంగంబుల్
వినఁదగినవేని నేను
న్వినువేడుక నానతీయ ♦ వేఁడెద మిమ్మున్. 10

మ. అనినన్ముద్వరుఁ డవ్వికొంచు వినుమ ♦ న్నా ! యెన్న మాకెన్నఁడై
ననునీవిన్నదెమాటగానివినకుం ♦ డంబలుక పలుకన్నదే
వినుమన్నన్వినకుందువేవినియు నీ ♦ వేదాని వేచేయవే
నినుమేమియ్యకొనంగఁజేయక ప్రయ ♦ త్నింపన్ స్వతంత్రింతువే.

మ. వినునేఁడేమనచుట్టపుంగమిమము ♦ న్వీక్షింపనేతెంచియుం
డి నిజాపత్యవివాహము న్నెఱపు గో ♦ ష్ఠిం దెచ్చి యందందుఁ జ
క్కని కన్నెల్ ఘటిచొక్క పున్వరులులో ♦ కశ్లాఘ్యవంశుల్గలా
రనుకొంచుండఁగ వచ్చె నీదయిన క ♦ ల్యాణప్రసంగోక్తియున్

ఉ. ఓయికుమార! నీదగు స • మున్నత దక్షిణ బాహుపీఠిపై
నీయవనీవధూటి వసి • యింపకమున్నెక భద్రలక్షణ
శ్రీయగుకన్య ధన్యగతి • చేఁ బెఱకేలుఁ గ్రహింప నర్హమా
ప్రాయపువాఁడవైతివను • పల్కులఁ గుల్కుచునుంటి మీయెడన్.

క. అనినన్ ముసిముసినగవుల
నెనసినయభిలాషలజ్జ • లించుకపైకిం
గనుపట్టఁ గెలనమెలపున
ననుచరుఁడిడు నాకుమడుపు • లఁదికొనుగతిన్. 14

చ. తనముఖమందుఁదోఁచు ప్రమ • దంబును గోర్కియు సిగ్గు నేరికిం
గనఁబడకుండఁగా నటు మొ • గంబయి యల్లన వాని కెవ్వియో
యొనరఁగ ముచ్చటల్ దెలుపు • చున్నటులుండఁగ నెందునుండియో
యనుఁగులు దోడరా ననుఁగు • లా సహజన్ములు నేగుదెంచినన్.

ఉ. తమ్ములనెమ్మిఁ గ్రిమ్మదవు • దప్పులఁ గన్గొని సన్నఁ జేసి వా
ర్వమ్ములఁగూర్పఁ బంచితిదె • వచ్చిరె సాదులు స్వారికేగ నె
య్యమ్మున మమ్ము రమ్మనుట • కా యిటువచ్చితిరంచునుండ మో
దమ్మునఁ జిన్నిమన్మలను • దండకురండని యవ్వ నవ్వుచున్.

గీ. కౌఁగిటను జేర్చి శిరము లా • ఘ్రాణములను
జేసి యంకంబులను గొంత • సేపునిల్పఁ
జేసి తగు పీఠికల నిల్పి • చిన్నితనయు
లార! యెచ్చటి కిపుడు మీ • స్వారియనిన. 17

క. ఆయెడఁ గుమారమహిపతి
రాయేంద్రుని చిఱుతపట్టి • గ్రక్కున ధర్మా

రాయేంద్రుఁడు మేమీ యెడ
నేయెడకును స్వారివెడలు • టెఱుఁగమటన్నన్. 18

క. ఏమిర ? చిన్నికుమారా !
యీముప్పురు నేగఁదలఁచి • రేస్వారికి ? నీ
కేమైనఁ దెలుపలేదే ?
నీమాటవిని తలఁపవైరెరె • నెయ్యపుటన్నల్. 19

ఉ. నాపుడు దంభహీనముగ • నల్వుర మీయెడ నింతవట్టు వి
ద్యావసథమ్మునన్ గురుజ • నానుమతిం జదువుల్గ్రహించి మీ
సేవ యొనర్ప నంతిపురిఁ • జేరుటకై నియమించుకొన్న మా
తోవల నిట్లు వచ్చితిమి • రూఢిగ నించుక నెనర్ముందుగాన్.

సీ. స్వారికై విచ్చేయు • సన్నాహమున్నచో
మొగసాలకడ రథం • బులును గరులు
వారువంబులు భటుల్ • వందిమాగధులును
బంధుసందోహము • ల్పటహముఖ్య
పాణివాదకులును • వేణుపణవముఖ
వాదిత్రకరులాత • పత్రకేతు
చామరగ్రాహులు • సౌవిదుల్మొదలుగాఁ
గల పరివారంబు • గలయకున్న

యన్న యీయన్నలకుఁ గను • సన్నఁజేసె
నన్నుఁ గాదని యేలొకో ! • యెన్నఁజాల
నన్న నద్దేవి నవ్వి నా • కన్నతండ్రి !
గ్రన్నన వచింపు మఱల నీ • యన్న తెఱఁగు. 21

మ. అనుచో నెయ్యపుఁగిన్క వీడకుము దో • ర్దై కూడ నప్వావనిం
గని యా రామనృపాలుఁ డిట్లనియె నేఁ • గన్నెన్గఁ గావించినా
నని బాంకేటికి నాకుఁ దమ్ముఁడ నినుం • డాయంగరమ్మంచుఁ జే
సిన యా సన్నకు నిన్ని పన్నితివి నీ • చెయ్వుల్గడుం జిత్రముల్.

క. అనినన్ నను రమ్మని చే
సినదో మఱి లేక వారు • చేరుటకై చే
సినదో కాని యెఱుఁగ నేఁ
డనఘా! సైగ యొనరించి • నది నిజమె కదా! 23

క. గుఱ్ఱంపుస్వారి వెడలఁగ
నుఱ్ఱూటల నూఁగు నాకు • నొక యూడిగపుం
గుఱ్ఱఁడు లేదని తెలిపెను
వెఱ్ఱినె యది యున్నగవని • విడిచి యిటకు రాన్. 24

క. ఆ ముద్దుముద్దుమాటల
కాముప్వరు మోదమంది • యాతని మోమున్
మోముల గదించి ముద్దిడి
రామప్రభుఁ గాంచి చూస • రమ్యాననులై. 25

క. ఏమేమీ రాజోత్తమ
మీమీకల్లలును మఱియు • మీమీనిజముల్
మేమే మెఱుఁగుదుమయ్యా!
మీ మాయలు మర్మములును • మీకే తెలియున్. 26

సీ. అద్దేవి కారీతి • ముద్దేవి గాకున్కి
చేఁ జిన్నిమనుమని • చెన్నుమీఱు

చున్న సల్లాపము ♦ నుడుపఁజాలక యుండ
నామె పిన్నకుమారుఁ ♦ డగు కుమార
మహీపతిరాయ క్ష్మా ♦ మానాయకుఁడు దన
తనయాగ్రిగణ్యుఁడు ♦ ద్వాహగోష్ఠి
వలన సించుక నాన ♦ నెలకొన్న మనసుతో
వేఱె ముచ్చటలు గా ♦ వించు టెఱిఁగి

యప్పటికిఁ దత్ప్రసంగంబు ♦ నాఁపఁదలఁచి
తనకు వాహ్యాళి నిత్యవ్ర ♦ తమను మాట
యాత్మ్రలను మున్నె తెలిసిన ♦ యక్కతోడ
జననితోడను దెలిపి యా ♦ జ్ఞఁగొని లేవ. 27

క. కొడుకులు బంధులుఁ దనతోఁ
గడుషడిగా లేచి యవ్వ ♦ కడఁ దామును నె
ల్వడ వేఁడు వేడ్క నిలువం
బడ నామె వచించెఁ బెద్ద ♦ మనుమనితోడన్. 28

క. దొరలును బితృవ్యుఁడును సో
దరులును నీవు నిపు డేగి ♦ తడయక నా బం
గరుతండ్రి వెండియును నొక
పరి నేఁడో రేపొ కానఁ ♦ బడియెదు కాదే. 29

క. అనియనుప నందఱుం దన
తన నెలవుల కేగి సముచి ♦ తములైన పరిసా
ధనములను దాల్చికొని వెం
టనె కూడిరి తోడఁ దగు జ ♦ నంబులు కొలువన్. 30

సీ. కాసె బిగింపుతోఁ ♦ గన్పట్టు సుర్వాలు
నీలమండలఁ దాఁకి ♦ చెలువు మీఱఁ
బూనినట్టుల మేన ♦ నానిగాఁ జూపట్టు
తెలిపట్టుమీజ్రాల ♦ పొలపమొప్ప
ఠీవిఁ జొళ్ళెముగఁ జు ♦ ట్టిన కుసుంబారంగు
పాగ తొదలలందు ♦ బాగుసూప
నడిచుట్టుఁ జుట్టిన ♦ యొడికపు జలతారు
ఖండువా చెఱఁగుల ♦ నిండు మెఱయు

సోగ తిరుచూర్ణరేఖలు ♦ సొగసులుకఁ
గరము కరములఁ గోరడాలు ♦ పెరవు నెఱప
ననుచరులొసంగు వీడెంబు ♦ లందుకొనుచు
మువురు నేనుంగుమొగసాల ♦ ముందునిలువ. 31

చ. కటితటి వెన్కకున్ విఱిచి ♦ కట్టినపుట్టము నిల్వుటంగి మి
కుక్కట మగు సోగపాగ సరి ♦ క్రొత్త జరీ సరిగంచు హొణియుక్
బటికపుఁగోళ్ళ చందనపుఁ ♦ బావలు దంతపుఁ జేతికఱ్ఱయుం
దిటముగఁ దాల్చియల్లనరు ♦ దెంచెఁగుమార మహీపతీంద్రుఁడుక్.

చ. జనకుని కేలువట్టి జగ ♦ జంపుఁగుళాయియుఁ బట్టుఢట్టిఁ బ
చ్చని కుతినీరుమా లలఁతి ♦ సన్నపుఁ జిన్నెల కాలిజోడునుం
దనరఁగఁ జిన్ని మన్నెదొర ♦ తమ్ముఁడ! రమ్మని మువ్వురన్నలుం
జనువునఁ బిల్వఁగాఁ గదిసి ♦ సస్మితుఁడై మురిపెంబుచూపుచోక్

మ. సుతులం దేజుల నెక్కి వెల్వడుఁడటం ♦ చుం బ్రేమచే నమ్మహీ
పతిరాయప్రభుఁ డానతీయఁగ జగా ♦ పల్లఁపుటాంగన్నయుం

జతనంబొప్పఁగఁ జిన్నితమ్ముని విభా • స్వదీప్తి నెక్కించి యా
త్మతురంగంబుల నెక్కువారలయి త • త్పార్శ్వంబులం డాయుచోన్.

సీ. గటితంబులగు తళుకు • పటికంపుఁ బిడిగుబ్బ
లలరొందు పొల్పు త • ల్పుల జడంగ
వ్రాసిన మృగపక్షి • ఫల పుష్ప తరు లతా
ప్రతిమలతోడి య • ప్రతిమభంగి
ముత్తెంపు మొత్తంపు • గుత్తుల గుత్తంపు
జాలరుల్ వ్రేలు న • స్సరుల డంబు
నుద్దిఁగానఁగరాని • నిద్దంపు టద్దంపుఁ
గవగూళ్ళ ముంగిటి • కడ పెఱరంగుఁ

బైకిఁ ద్రోసిన గవిసెన • పసిఁడి మొసలి
వాల్ దండెలు బాలీసు • పసుపుదిండ్లు
జాళువా సంబెలయును గూ • జా కటారిఁ
బరగు నొక కొత్తరంగు స • వారిఁ దెచ్చి. 35

గీ. నడుములు బిగించుకొని బెత్త • లడుగుజోడుఁ
గొనఁగ నొకకుఁడుఁ గొందఱు • వెనుకదండె
యెత్తుకొని యాయితంబయి • యెదురు చూడ
నల్లన మహీపతీంద్రుఁడం • దధివసింప. 36

ఉ. చవ్వన మువ్వురందుమికి • స్వస్వతురంగము లెక్కనంతలో
నెవ్వరికెవ్వియివ్వియని • యేర్పడియుండెనో యట్టియానముల్
దవ్వుల వేచి యుండితఱిఁ • దప్పక వజ్జల సజ్జితంబుగా
నివ్వటిలంగ సేవకులు • నిల్పఁగఁబొల్పుగ డాసి యంతలోన్. 37

క. తగినట్టి వేషములబం
దుగులగు దొరలున్మనీలు ♦ నుందోడ్తోనే
నుఁగులవయి గుజ్జములపై
నాగినెక్కిరి స్వస్వజనము ♦ లోరల నిలువన్. 38

ఉ. సౌవిదులంతనంతను హా ♦ సాదు పరాకని హెచ్చరింప ను
చ్చావచ తూర్యరావములు ♦ శ్రావ్యముగా వినవచ్చుచుండ నా
నావిధ గద్యపద్యకల ♦ నంబులవంది జనుల్నుతింపఁగా
నావిభుమండలంబునగ ♦ రాపణవీథులనుండి వెల్వడెన్. 39

ఉ. క్రేవల జాల్మ్రతీలతుల ♦ కిఁపుల కింపులు గుల్కుమీఱ బా
లావళి విన్నపంబులకు ♦ నంతట నింతులువట్టుకప్రపుం
దావుల బల్విన్నాళులకె ♦ దన్మ్రదమందుచు మందయానలీ
లావిభవంబు డంబుగఁజె ♦ లంగలలింగదలెన్ నృపౌఘముల్. 40

ఉ. అల్లననేగి మాధవుని ♦ స్యందన పుష్కరిణీవనంబులం
దెల్లవినోదముల్గనుచు ♦ నిర్లదయింపకమున్న దివ్విటీల్
కొల్లగ నివ్వటిల్లగను ♦ గోటకు నేగిరి మోడ్పుకేలు సం
ధిల్లఁగ రాజమార్గమున ♦ దిగ్గనఁబౌరులు లేచి నిల్వఁగన్. 41

సీ. వంకర సిగలపై ♦ వాలుగా నొకచెంప
మలచి చుట్టినతోపు ♦ తలరుమాళ్ళు
నెడమచెంపలు దాఁక ♦ నిడుదలై కనుపట్టు
బలుపచ్చ ఱాకొన ♦ బావిలీలు
ముంజేతిపైఁ బాలు ♦ మొనసిన పలకల
వన్నెతక్కువ పైఁడి ♦ వలయములును

దీర్ఘైన తెలిమొగ్గ ♦ తీఁగంచులునిపిన
చుట్టు చెంగావిడాల్ ♦ పుట్టములను
వేళ్ళనిరుమూఁడు గుత్తంపు ♦ నెండిచుట్లు
పొడవు టూపులు నొప్పారు ♦ పురుషులిర్వు
రెలమిముదుసలి బోనగ ♦ త్రైలు పిఱింద
దెసగ సిర్వురు నిల్వ నొ ♦ ద్దికవసింప. 42

ఉ. వారలవేషముల్గనఁగఁ ♦ బశ్చిమదేశజులట్లు తోఁప నె
న్నారిజనంబొ యిచ్చటకు ♦ వచ్చుటకెంగత మెద్దియొక్కొ యే
యూరు నివాసమో యొచటి ♦ కోచనుఁగొంచును నిల్చి యవ్విభుల్
చేరువ సేవకుం గని వ ♦ చించు నుడుల్ విని క్రొత్త మానుసుల్.

సీ. హాస్యములాడ్చి యి ♦ ట్లని విన్నవించిరి
దేవరలార! మా ♦ దేశ మిచటి
కిర్వది యామడ ♦ నెసఁగు పశ్చిమరాష్ట్ర
ములను గృష్ణాగౌత ♦ ములకు నడుమఁ
దనరారు రాజధా ♦ ని రహించు నెల్లంకి
వారి భృత్యులము మా ♦ వచ్చినట్టి
కృత్యంబు నెల్ల ల ♦ క్ష్మీవెంకయాంబమ
మ్మలు దేవేరి యి ♦ మ్మలికమ్మ
ముందుగా నందుకొని యంత ♦ నందఱకును
బొందుగా నందఁగల యర్థ ♦ మును వచింప
వ్రాసినట్లు జగన్నాథ ♦ రాయవిభుఁడు
మా యొడయఁ డానతి యొసంగి ♦ మమ్ముఁ బనిచె. 44

క. అనినఁ గుమారమహీపతి
జననాథుఁడు నవ్వికొనుచు ♦ సంతోషము మీ
చను దెంచుట నిందుండుం
డని తనయులుఁ దాను లోని ♦ కల్లన నరిగెన్. 45

ఉ. అంతట దేవి తజ్జనస ♦ మాగమనంబు నెఱింగి చేటికా
కాంతల నిర్వురం బిలిచి ♦ గ్రక్కున వచ్చిన బోనగత్తెలన్
సంతసమొప్ప నంతిపురి ♦ చక్కటికిం గొనితేర భృత్యులం
బ్రాంతమునందుఁ బొందగు సు ♦ వారపుటిండ్ల వసింపఁబంచినన్.

క. ఆ నిశి నుక్తస్థలముల
స్నానంబుల భోజనముల ♦ శయనంబుల న
మ్మానుసు లాదృతులై య
న్యూన సుఖావాప్తి గదుర ♦ నుండఁగ నిచటన్. 47

క. దొరలెల్ల నెవ్వరెవ్వరి
యిరవుల జలకంబులాడి ♦ మృదులాంబరముల్
ధరియించి భుజించి వరా
స్తరణములగు తల్పములను ♦ శయనించినచోన్. 48

ఉ. నిద్దుర రాక రామధరణీవిభుఁ డాత్మఁ దలంచె నిట్లు నేఁ
డెద్దియొ గోష్ఠి రాఁగ హిత ♦ వృత్తి వివాహపుమాటఁ దెచ్చిరే
ముద్దులుముచ్చట ల్దెలిపి ♦ పొందుగఁ బిన్నటనాఁటనుండియుం
బుద్ధులు సుద్దులుంగఱపి ♦ ప్రోచిన పెద్దలు దద్దయుం దమిన్. 49

చ. అది యటులుండె స్వారిజను ♦ నప్పుడు వెండియు నేఁడొ రేపొ వ
చ్చెదు గదె యంచు నవ్వియు వ ♦ చించుటబందుగులంపు సేవకుల్

మునుసలి బోనగత్తియలు • మున్నుగ వచ్చుట యత్తపేరను
న్నదియిదె వేలికమ్మయని • నమ్మఁగఁబల్కుట మేలుఁదెల్పెడిన్.

ఉ. ఎవ్వరికన్యయో గుణము • లెట్టివొ రూపవిలాస మెట్టిదో
యెవ్వరిఁగూర్చి వచ్చిరో యి • దెంతయు నన్నుగణించిరైన మా
యవ్వయు నత్తయున్ మఱియు • నయ్యయు నేమనియానతిత్తురో
యువ్విళులూరు నాహృదయ • మున్న తెఱంగు నెఱుంగునంతకున్.

ఉ. అత్తకు బావకూఁతులఁట • యామెకు సమ్మతమైనచోట నీ
బిత్తరిప్రాయపుంజెలులఁ • బెండిలిసేయఁ గడంగి వీరలో
కొత్తరుఁ డర్కిలిం బ్రతిన • నూనినవాఁడఁట వ్రాసినట్టి య
య్యుత్తరమందు నేమిగల • దో యది యెల్లియొ తెల్లమౌఁగదా.

సీ. నను నీయభిప్రాయ • మును దెల్పుమన్నచో
నేమంచు నుత్తరం • బిచ్చువాఁడ
నీయకూరకయున్న • నిది యేటి సిగ్గంచు
నవ్వనవ్వంగ నే • మనెడువాఁడ
నా తలంపిది యంటి • నాస్వతంత్రుఁడవైతి
వనిన నేమంచు మా • టాడువాఁడ
మీచిత్తమంటినా • తోఁచినగతి నాచ
రించిన నేకీడఁ • దిప్పువాఁడ

ననుచుఁ బెక్కువిధంబుల • నౌనుఁ గాద
టంచు బహుపూర్వపక్షసి • ద్ధాంతకోటు
లెంచి తనలోనఁ దానె కా • వించుకొంచుఁ
గన్నుమూయక రేయెల్లఁ • గడపె నతఁడు. ౫౩

ఉ. అంతటఁ దెల్లవాఱె సమ • యార్హవిధంబుగ దేవిదర్శనం
బంతిపురంబున న్నెఱపు • నట్టి దొరల్ గసవారుఁ గూడి యు
న్నంతట బంధుసేవకు లు • పాయనయుక్తిగ లేఖ నిచ్చి యా
య్యంతులలోనికంపి తెర • యావలఁ దాను వసించియుండఁగాన్.

క. కొని దానిఁ జదివికొని క్రి
న్నన లక్ష్మీవెంకయాంబ • నగవుమొగముతో
జనయిత్రి కొసఁగ నామెయుఁ
గని తనయున కొసఁగె నతఁడు • గని ముదితుండై. 55

గీ. తిరుగఁ దల్లికొసఁగఁ జెలునవ్వు మోమునఁ
దొరల నచట నున్న • దొరలఁ గాంచి
యానతిచ్చె భావయాంబామహాదేవి
ప్రేమమీఱ నాఁడు • బిడ్డఁ జూపి. 56

మ. వినుడీ యీబిడ తోడికోడలిదె యా • ప్తిన్ లేఖనంపించెనా
ధుని యాజ్ఞందన కన్నకన్నెలగు కూఁ • తుల్మువ్వురున్ మీకునుం
దనయల్గావునఁ బెద్దకూఁతును భవ • ద్బంధున్విమర్శించి యా
యనకుం దక్కిన వారి నిర్వురను మే • నల్లుళ్ళకిప్పింపుఁడీ. 57

క. అని మన శీతయ్య యిటుల్
మనమునఁ గోరికయటంచు • మనకనిపెను వా
ర్తను మున్నె తోడికోడలు
తనవంక దెసేనునట్టి • దానసెకానన్. 58

క. అయ్యువతులు వరుసను వెం
కయ్యాంబయు మంగయంబ • యనియును మఱి చె

ల్లయ్యంబయి నఁట యిటు మన
వియ్యముపై నెయ్యమొదవ • వేడుకపడియెన్. 59

క. నాపుట్టినింట నొక్కఁడె
యేపాటిదియైనఁ బిల్ల • దెవరికి నైనన్
నాపౌత్త్రిల కెనయగునది
నూపట్టఁ దలఁతునెయొరుల • చుట్టఱికంబున్. 60

క. మనసీతయ్యయు నేనున్
ఘనమగు నొక వంగడమునఁ • గాదేజన్మిం
చినవార మట్లుగావున
ననునాపిడ గౌరవంబు • నను దలఁచుమదిన్. 61

శా. సూనుప్రాయులుగాఁగఁ బెంచితిని బ్రా • జ్ఞుల్గాఁగ నాయన్నసం
తానంబౌ మగచిన్నవాండ్ర నెనమం • డ్రన్వారిలోఁ బెద్దయా
వానిన్ వెంకటరాయనాముని మహీ • పాలార్థనానాకళా
నూనప్రజ్ఞుని బెద్దపిల్లకెనగా • నూహింతుఁ జిత్తంబునన్. 62

శా. నాపౌత్త్రాగ్రణి పూర్వరాజనమవి • జ్ఞానాది నానాగుణ
శ్రీపూర్ణుండవతారమూర్తి కలవ • ర్ధిష్ణుండు సత్కీర్తికిం
బ్రాపౌ రామయతండ్రి వానికెనగా • భావింతునమ్మంగయన్
వ్యాపింపందమకీర్తిమించు నలదాం • పత్యంబుసాపత్యమై. 63

క. పిల్లదియగు జెల్లయ్యకు
వల్లభుఁడుగఁ గూర్పవచ్చుఁ • బర్యాయముచే
నెల్లగుణంబులచేవ
ద్గిల్లెడు మన సూర్యరావు • శ్రితహితభావున్. 64

మ. అని డెందంబున నిశ్చయించుకొని భా ♦ వయ్యాంబ తాఁ దెల్లవా
ఱిన వెంటం దనపుత్త్రిఁ బౌత్త్రులను బు ♦ త్త్రిం గూర్మిఁ బిల్పించి మం
తనమందుండి యొకింత సేపితర వా ♦ ర్తల్ ముచ్చటల్ దెల్పి య
ల్లనఁ దల్లేఖ లెఱుంగఁ దెచ్చి హితస ♦ ల్లాపంబు గావించుచున్. 65

మ. మనసీతయ్యయు నామె భర్తయు నుసం ♦ బంధక్రియాసక్తులై
మనపేరన్లిఖియించినారు గద క ♦ మ్మం దాని తాత్పర్యమీ
రును నిన్నన్వినినట్టిదే మఱలవా ♦ క్రువ్వంగ నింకేల యే
మని ప్రత్యుత్తరమీయవచ్చునది యే ♦ యావశ్యకం బియ్యెడన్. 66

వ. అనినఁ దత్పుత్త్రిక యగు లక్ష్మీవెంకయాంబ యిట్లనియె.

సీ. ఆయువతీమణుల్ ♦ మాయత్తవారింటి
యాఁడుబిడ్డలు గాన ♦ నస్మదీయ
లీపుత్త్రరత్నముల్ ♦ నాపుట్టినింటివా
రలు గాన నస్మదీ ♦ యులు గదమ్మ
యుభయుల సంబంధ ♦ మొనగూడెనేని నా
కధికమౌ సంతోష ♦ మావహిల్లు
ననివేఱెఱుకసే ♦ యఁగనేల మీ యెఱుం
గని లోకధర్మము ♦ ల్గలవటమ్మ
నీకుటుంబంబునకె కాదు ♦ నిఖిలబంధు
వితతియును మెచ్చఁదగిన వి ♦ వేకవతివి
గాన నీచిత్తవృత్తిప్ర ♦ కారముగను
జేయుమని తెల్పెఁ దన యభి ♦ ప్రాయమిట్లు. 68

వ. అంతఁ గుమారుండగు కుమారమహీపతిరాయవిభుం డిట్లనియె. 69

శా. తల్లీ యిప్పటికీ తనూభవులకుం ♦ దఱింప మేనఱపుం
పెల్లిండ్లనఁగ రారు కన్నియలలో ♦ వెల్లంకివారింట శ్రీ
మల్లీలాకృతు లిచ్చెలుల్వలయ సం ♦ బంధంబు వే జొంపునా
యుల్లంబుం దనియింపఁజాలదిఁక మీ ♦ యుద్దేశ మెట్లున్నదో. 70

చ. అని తనబిడ్డ లిర్వురు ని ♦ జాత్మల వృత్తులు వెల్లడించిన
న్విని చిఱునవ్వునవ్వి తను ♦ నేమన మెందఱ మెన్నియెన్ని నం
బనుపడునే వధూవరుల ♦ భావమెఱుంగక పెండ్లియత్నముల్
పనిఁగొని సేయఁగా వయసు ♦ వచ్చిన పిల్లల కెల్లభంగులన్.

సీ. రూప మెట్టిదియొకొఱ ♦ రూపింపవలెనంచు
మానసంబులను సం ♦ భ్రమము కొంత
గుణము లెట్టివియొకొఱ ♦ గణుతింపవలెనంచు
డెందంబులందుఁ దో ♦ ట్రిలుట కొంత
తెలువు లెట్టివియొకొఱ ♦ తెలియఁగావలెనంచు
హృదయంబులను దత్త ♦ రిలుట కొంత
వంశ మెట్టిదియొకొఱ ♦ పరికింపవలెనంచు
భావంబులను వేదఱఁ ♦ బడుట కొంత
మఱియు సిరులెంతటివియొకొఱ ♦ యెఱుఁగవలయు
ననుచు నెమ్మనములఁ గుతూ ♦ హలము కొంత
గలిగి యన్యోన్యమును సము ♦ తఱంఠ ఘెరయు
లాఁతి చుట్టఱమునను జె ♦ ల్వాయ వరుండు. 72

క. అని తనదు పెద్దమనుమనిఁ
గని యో మాతండ్రి నేఁడు ♦ కల్యాణకళా

ఖనివై చక్రిని చెలువునఁ
గనుపట్టెదుసుమ్మి సంజ ♦ కంజారివలెన్. 73

చ. అనవుడు గుట్టు సిగ్గు పెన ♦ యంబును మోమునఁదోఁప నాపడం
తిని గని యాతఁ డిట్లనియె ♦ దేవి భవద్వచనంబులెల్ల విం
టినిగద యమ్మ యుత్తరము ♦ నేనిడునట్టిదఁటమ్మ దానికీ
వానరఁగ నెట్టిదో తలఁప ♦ కుందువఁటమ్మ దిటమ్ముగా మదిన్.

గీ. ఆమె మేనయత్త ♦ యాయన పిన్నయ్య
యయ్యఁ గన్నయట్టి ♦ యవ్వ వీవు
మేలుఁ గూర్ప నాకు ♦ మీకంటె నెవ్వార
లింతకంటె మేలు ♦ నెద్ది యరయ. 75

క. పెంచితిరి పెండ్లిసేయఁద
లంచితి రది మేలుగాఁద ♦ లంపక యేమో
యంచు నిరసించువారు ప్ర
పంచమ్మునఁ గలరఁటమ్మ ♦ భావించంగాన్. 76

ఉ. చేసిన వృద్ధి నన్నడిగి ♦ చేసితిరే యిది నన్నుఁ గోరఁగా
నీసరికెవ్వరైనఁ గుల ♦ వృద్ధులు గల్గఁగఁ బిన్నవారలే
వాసిఁ దొలంగి మున్న మన ♦ వంగడపుంగొమరు ల్స్వతంత్రులై
వాసవతుల్య వైభవము ♦ వచ్చిన నియ్యకొనంగఁజొచ్చిరే. 77

క. అన నీవు రాజవయ్యా!
నిను సామాన్యుఁడుగఁ గనుట ♦ నీతియఁటయ్యా!

తనకు రుచింపని నుడులకుఁ
గొన ముక్కిఁడి గాదఁటయ్య • కొఱకొఱ పతికిన్. 78

క. అన నామె క్రాతఁడిట్లనె
నను సామాన్యుఁడుగఁ గనుట • న్యాయమఁటమ్మా
మును పెద్దలమాటలఁ గై
కొనకే పని నేనె చేయఁ • గోరితినమ్మా. 79

శా. గాంధర్వంబొ స్వయంవరంబొ యిదిలో • కఖ్యాతిస్వాతంత్ర్యధా
రాంధర్యంబు వహింపఁ బట్టమహిషీ • గ్రైవేయపుందంతుపుం
బంధింపన్నమకట్టు వేళ స్వజనోపశ్లాఘ్యమౌనట్టి సం
బంధంబొప్పగుఁగాని యేరికయినన్ • స్వైరక్రమం బొప్పునే. 80

క. మీచిత్తవృత్తి యిందుల
కేచొప్పున నొప్పునట్టు • లేర్పఱుపుఁడు మీ
రోచించినయది కల్యా
ణాచరణోచిత నిరూఢి • నలరెడుఁగాదే. 81

చ. అని తనయందె పెద్దఱిక • మంతయు నుంచి సమంచితోక్తులన్
మనుమఁడు విన్నవించినఁ గు • మారుఁ గుమారమహీపతీంద్రునిం
దనయను వెంకయాంబను ము • దంబునఁగన్గొనియింతయొప్ప నే
మనకులమౌళి పెంపనుచు • మక్కువఁజూపుచు నామెయిట్లనున్.

క. వెల్లంకివారి పిల్లలు
సల్లలితాకారరూప • సౌభాగ్యకళా

సల్లాప మృదులతా సం
వల్లీలా రమ్యసౌమ్య ♦ మతులని విందుర్. 83

వ. కావున. 84

మ. మనమెవ్వారలమైనఁ గొందఱము స ♦ మ్యగ్రీతి నవ్వీటికిం
జని యాకన్నెల భద్రలక్షణ కళా ♦ సౌందర్యసౌశీల్యముల్
గని రానొప్పుగుఁ గాన భద్రగిరిలో ♦ కస్వామి శ్రీరామచం
ద్రుని సేవించు నెపంబున న్వెడలఁ ద ♦ జ్ఞుల్మెచ్చు కృత్యంబగుర్.

సీ. ఆవెలందులలోన ♦ నగ్రజయగు వెంక
యమ్మ నాకును మేన ♦ యల్లుఁడగుచు
విలసిల్లు చెలికాని ♦ వెంకటరాయని
కలికిగా రెండవ ♦ కన్నె యయిన
శ్రీ మంగయాంబికా ♦ సీమంతినీమణి
నీవిభుపట్టంపు ♦ దేవిగాఁగ
సంబంధముల నిశ్చ ♦ యంబొనరించి క
ల్యాణోత్సవంబు లీ ♦ హాయనమునఁ

జేయుటయుఁ జిన్నికన్నియఁ ♦ జెల్లయమ్మ
నవలఁ గోన్నాళ్ళు జనఁగ జ ♦ నార్దనునకుఁ
బట్టమహిషిగ నొనరించు ♦ వారమంచుఁ
జెప్పి రావచ్చుననుకొన్న ♦ చిన్నెలున్న. 8

క. రంగద్గతి మనమటు సే
యంగన్మంగళ మెసంగ ♦ స్వార్థము తీర్థం

బుం గలసి వచ్చుఁ గావున
నంగనలంగనఁ జనంగ • నగు శీఘ్రముగన్. 87

క. ఇప్పటికి వారి లెంకల
నొప్పుగ గతిఁ దనిపి యనిపి • యూహించిన యీ
చొప్పున నొప్పఁగఁ దప్పక
యప్పైనను వేగ నెఱప • నగుఁ దొలుదొలుతన్. 88

మ. అని యీతీరునఁ జైనముఖ్యుఁ డనఁగా • నంగీకృతిం జేసి యం
తనె మౌహూర్తిక నిశ్చితంబగు ముహూ • ర్తంబందు బంధూత్కరం
బనుగ శ్రేణియు గంధసింధుర జవా • ద్యత్సైంధవారూఢులై
తన వెంటం జనుదేరఁగా వెడలెఁ ద • త్కన్యావలోకార్థమై. 89

క. సరియానంబునఁ దనకూఁ
తురు లక్ష్మీవెంకయాంబ • తోడన రాఁగా
నరిగె మఱికొంద ఱంతః
పురకాంతలు సుచితయాన • ముల నేతేరన్. 90

క. వెలువడి భద్రనిమిత్తం
బుల నెడనెడఁ గనుచుఁ దొలుతఁ • బురమార్గముచేఁ
గుల దైవతముల హితకా
రుల మాధవ కుక్కుటేశ్వ • రులఁ గొలిచితగన్. 91

గీ. ప్రథమ వసతిగఁ దమపూర్వ • రాజధాని
యైన చామర్లకోటలో • నధివసింపఁ

దలఁచి నిస్సాణకాహళుల్ ♦ దత్పథంబు
వట్టి చన వేగఁ జొచ్చిర ♦ వ్పట్టణంబు. 92

క. సిరి పరిఢవిల్లఁ దొలుతం
బురోహితుఁడు హితుఁడు వింజ ♦ మూరికులుఁడునై
పరఁగెడు వేంకటరామయ
ధరణీసురవరునియింటఁ ♦ దగ వసియించెన్. 93

శా. అచ్చో రెండుదినంబులుండిరి కుమా ♦ రారామభీమేశు శ్రీ
మచ్చారిత్రుని భక్తవత్సలు హరి ♦ న్మాండవ్యనారాయణుం
బొచ్చెంబింతయులేని యర్ఘ్యములచేఁ ♦ బూజించుచున్ మన్ననల్
హెచ్చన్విప్రులఁ దన్పుచుం బ్రజల సం ♦ తృప్తాత్ములం జేయుచున్.

ఉ. అక్కడనుండి వెల్వడి గ ♦ జాశ్వ భటచ్ఛట తోడఁ గూడ నాఁ
డొక్కెడఁ బల్లియన్విడిసి ♦ యొయ్యన రాజమహేంద్రపట్టణం
బక్కజమైనకల్మిఁ జెలు ♦ వారురువారముఖండ గౌతమీ
న్రిక్కలితోపకంఠరుచిఁ ♦ జూపెడు దానిని జొచ్చి యచ్చటన్. 95

సీ. కోటిలింగక్షేత్ర ♦ వాటి శ్రీ కోటిలిం
గేశ్వరు నభిషేక ♦ తృప్తుఁ జేసి
తత్పార్శ్వవర్తి సీ ♦ తారామచంద్రమూ
ర్తికి సమర్చామ చ ♦ ర్చికలఁ గూర్చి
యపమృత్యుభయపరి ♦ హారి మార్కండేయ
లింగేశుఁ జంద్రమౌ ♦ ళిని భజించి
పుష్పగిరిక్షేత్ర ♦ మున గౌతమీదేవి
సకలోపచార పూ ♦ జలను దనిపి

పద్మగిరిసీమసామజ ♦ వరదు వరదు
కూల భూషాద్యలంకృతాం ♦ గుఁడుగఁ జేసి
రావుకులదీపకళిక యా ♦ భావయాంబ
నాఁటికవ్వీట మోదంబు ♦ ననువసించి. 96

క. ఆతమినందుండి మహా
గౌతమిరేపకడదాఁటి ♦ కనియద్దరియం
దేతమిదీరమి వారిజ
నేతమిగులనెగయకుండ ♦ నిలిచిరి నెమ్మిన్. 97

సీ. అతిముగ్ధజానప ♦ దాంగనాసాశ్చర్య
వీక్ష్యమాణోన్నత ♦ ద్విపకులంబు
ప్రాంతపల్లీశ్రోత్రి ♦ యస్వస్తివాదము
ఖరితావసథగృహాం ♦ గణతలంబు
ఫలశాకతక్రాది ♦ వస్తువిక్రియ కృన్మ
హుర్మహుర్ఘోషణా ♦ త్యుచ్చరవము
నేదిష్ఠపురవణి ♦ గ్నిచయసమానీత
వివిధార్థసంపూర్ణ ♦ విపణిభాగ
మగుచు గౌతమి కద్దరి ♦ నధివసించి
యున్నవారల సిబిరంబు ♦ చెన్నుమీఱెఁ
బ్రభువులెచ్చోట నెద్దిగా ♦ వలయునంచు
నూహగావింతు రదియందు ♦ నొదవుఁగాదె. 98

వ. అందుండి వెడలి. 99

క. శమితారణ్యకభయముగ
నమితార్భటిఁగతిపయప్ర ♦ యాణంబులన్

య్యమ వీయపు వారల రా
జ్యమును సమీపించి వార్త ♦ లంపించుటయున్. 100

సీ. చిక్కని బురకాల ♦ శిబికలవసియించి
యిరువుర దేవేరు ♦ లెదుటనరుగ
సుతులు మువ్వురు మదో ♦ ద్ధత గజారూఢులై
యిరువంకలను వెన్క ♦ నరుగు దేర
హిత బాంధవామాత్య ♦ తతిచుట్టునారట్ట
జతురంగములనెక్కి ♦ చక్కనడువ
బెడిదంపుటడిదంబు ♦ లుడివోని యడియాల
ములఁబూని బలములు ♦ బలసిరాఁగ

నడుమఁగడు మేలి ముత్యాల ♦ గొడుగునీడఁ
గుందనపు టందలమునందు ♦ నందమొప్ప
నగుచుఁగూర్చుండి శ్రీజగ ♦ న్నాథరాయ
నృపకులాగ్రణి యెదురుగా ♦ నేగుదెంచె. 101

శా. కన్యారత్నములప్పుడప్పగిది ను ♦ త్కంఠన్నిజాకార సౌ
జన్యశ్రీశుభలక్షణాదికపరి ♦ క్షాలాలసస్వాంతయై
యన్యూనంబగు వైభవంబలర భా ♦ వయ్యాంబ యేతెంచుటన్
ధన్యత్వంబును గంటిమంచు మువురా ♦ త్మన్ మోదముం జెందుచో.

క. భావుకతరరేఖాంకుఁడు
రావుకులోత్తముఁడు నన్ను ♦ రాణిగమదిసం
భావించుట నిక్కంబని
దావేమరు మంగయాంబ ♦ తలఁచున్ మదిలోన్. 103

ఉ. అసమ ప్రాభవ పీఠికానగరరా • జ్యశ్రీపదాధీశుఁడు
ల్లసదౌదార్యుఁడు రామరాయ నరపా • లస్వామి దేవేరిగా
వసుధం బాహువుఁ జేర్చుకంటె మును నా • న్యామాంకముం జేర్చియిం
పెసఁగం గైకొనకున్నె శ్రీరమకృపా • వృత్తిం గటాక్షించినన్. 104

చ. చక్కఁదనంబునన్ సుగుణ • సంపదమువ్వుర మొక్కతీరుగా
నొక్కట నొక్కెడన్వెలసి • యున్నను జెల్లెలు చాలఁ బిన్న మా
యక్కయొకింత పెద్దయగు • నవ్విభుకంటెను దానఁ జేసి పె
న్మక్కువనీకు జోడయిన • నన్నువరింపకయున్నె ప్రేమతోన్. 105

క. ఆవిభు నౌదార్యగుణం
బావిభు చక్కందనంబు • నావిభు నికళా
ప్రావీణ్యము భావింపఁగ
నావిభునకు సాటిలేద • టంచును విందున్. 106

ఉ. ఎప్పుడు చూతునో రమణు • హృద్యతరాకృతి రాజమార్గముం
దొప్పగు నందలంబున స • మున్నత వైభవ లీల రాఁగని
య్యుప్పరిగంగవాక్షమున • నుండి జనుల్ సను దెంచునంతలోఁ
దప్పక రెప్పలార్పక ము • దంబునఁ గౌతుకవాసరంబునన్. 108

సీ. రాజ్యాధికార ము • ద్రాముద్రికాధార
ణాధార దీర్ఘత • రాంగుళికము
బలికర్ణ జీమూత • వాహనాదిసమాన
దానధారాధౌత • ధౌతతలము
జలజాత జలజాత • కులిశాంకుశ రథాంగ
హలముఖ్య భద్రరే • ఖాంచితంబు

నధిగతద్వాత్రింశ • దాయుధవ్యాపార
కేళీకళాలబ్ధ • కిణగణంబు
సరసిజాభంబు నగుమనో • హరుని కేలు
లీలమైనాడు కెంగేలఁ • గీలుకొల్పు
భాగ్యము కొలంది నాళ్ళలోఁ • బడయఁ గల్గు
శ్రీ మహాలక్ష్మి కృపఁ గటా • క్షించెనేని. 108

శా. ఏలాతీరవనీవిలోకనముహు • ర్హేలా విహారంబులం
దేలాపూగలవంగ నాగలతికా • వీక్షావినోదంబులం
దేలాలిత్యముగాంచి సంతసిల నెం • తే శ్రీకృపంజూచెనే
నేలానన్నుఁ బరిగ్రహింపఁడు త్రిలిం • గేలావిభుండర్మిలిన్. 109

ఉ. చారుసుగంధ గంధఫల • సౌరభసారభరప్రసూనమో
చారుచిసంస్తవోక్తులఁ బ్రి • సన్నత కైరమఁ జూడుకుడ్తు నా
చారుభజింపఁ గోనెలకు • సమ్మతి రమ్మని నన్ను సన్నుతా
చారుఁడు ఓఁడుతోడ్కొని నె • సంజను భార్గవ వాసరంబునన్.

మ. ఫలతాంబూల సితాభ్రికుంకుమనిశా • భ్రాజత్ప్రసూనంబులన్
గలయంగూర్చిప్రదోషకాలములదీ • క్షన్ రాజరాజేశ్వరిం
గులభూభృత్తనయంగుమారజననిం • గోర్కుల్దొల్కనల్పాగ ని
చ్చలుఁబూజింపఁగఁబంపఁగా నాదవునో • సైరంధ్రికాశ్రేణిచేన్.

సీ. పుడమిదీవులనునే • రెడు దీవి మేటివ
ర్షంబుల భరతవ • ర్షంబు మేలు
ఖండంబుల భరత • ఖండంబు శ్లాఘ్యంబు
దేశంబులఁ ద్రిలింగ • దేశము మణి

యేటితీరముల నే ♦ లేటి తీరము మిన్న
నాళ్ళలోపలను బ్రో ♦ ల్నాడు మేలు
మండలంబుల భీమ ♦ మండలం బధికంబు
పురములలోఁ బీఠ ♦ పురము మేలు

దానికేలిక యగువాని ♦ కేఁడుగాఁగఁ
బడయఁగల నోము లేఁ దొలి ♦ బాము నందు
నోచియుంటిన యేని మ ♦ నోరథంబు
శ్రీకృపాదృష్టి సఫలతఁ ♦ జెందకున్నె. 112

హిమవాలుకా గంధ ♦ సుమమాలికాదు లే
ర్పడఁ గుంతిమాధవ ♦ స్వామికనుపఁ
బృథుధూప దీప నై ♦ వేద్యాది పూజార్పణ
వస్తువు ల్గుకుక్కటే ♦ శ్వరున కమప
ఫలపుష్ప తాంబూల ♦ ముల దక్షిణలతోడ
వృద్ధవిప్రులను రా ♦ వించియొసఁగఁ
కుంకుమంబు హరిద్ర ♦ కూర్పాసపట ఖండ
ములఁగూర్చి పురపురం ♦ ధ్రులకు నిడఁగఁ

బ్రాణనాయకు నానతి ♦ వడసి వినయ
మానితాచార పరిచారి ♦ కాని కాయ
మునకు నియమించి మించిన ♦ ఘనతనెఱపి
తనియు టెప్పుడొ నిత్యవ్ర ♦ తంబుగాఁగ. 113

ఉ. ఇవ్విధి నవ్వధూమణి య ♦ నేక విధంబుల నెమ్మనంబునం
దవ్వల నేని సాటియగు ♦ నవ్విభు పట్టపు దేవి నాదునం

చువ్వళులూరుచుండఁ జెలి ♦ యొక్కతెయక్కడికేగుదెంచి యో
జవ్వనియొంటినుంటకిటు ♦ సౌధమునంగత మేమియియ్యెడన్. 114

క. మనవారు బంధుల నెదు
ర్కొని వారలనెల్లఁ దోడి ♦ కొనివచ్చె హెళుయల్
గనుపట్టు గజహయాదులు
చనునప్పటికంటె హెచ్చు ♦ సంఖ్యయగుటచేన్. 115

శా. వింటే నెచ్చెలి కాహళీరవ మదే ♦ వీతెంచు వాద్యంబుల
మ్రోంటన్ మించుచుఁ గంచు గీచినగతి ♦ న్నిస్సాణనిర్ఘోషమా
వెంటన్మ్రోంటధణంధణార్భటులఁ గ ♦ ల్పించుంబ్రతిధ్వానమా
వెంటన్వీనులకింపుఁ జేయు శిబికా ♦ భృద్దీర్ఘ హూహూధ్వనుల్.

చ. అరసితె జాలమార్గమున ♦ నల్లవెయల్లన వీచు వెల్లచా
మరములు కేతనంబులును ♦ మౌక్తికపుంగొడుగుల్ హొరంగుబం
గరపు మెఱుంగురంగు శిబి ♦ కాతతు లిట్లరుదెంచు దవ్వులం
బరిజనపౌరజానపద ♦ వర్గము చుట్టునుమూఁగితోడరాన్. 117

మ. అనిచూపించెడునంతలోఁ గ్రమసమా ♦ యాతంబులై యానముల్
వనితాధిష్ఠితముల్ స్వమాతృయుగళీ ♦ లాచంద్రశాలాంతికం
బునశుద్ధాంతముచెంతనిల్వఁ బురుషుల్ ♦ పాల్పొందు నయ్యెస్వవా
హనముల్డిగ్గిరి చేవిడీకెదురుగా ♦ నంతంతనర్హస్థితిన్. 118

క. అంతట నంతిపురంబున
నెంతయు సంతనలవింత ♦ తెనఁగు గృహములం
దింతులఁ దగు విడుదుల సా
మంతుల నివసింపఁజేసి ♦ మహిపతి యంతన్. 119

ఉ. మజ్జన భోజనాదుల స • మగ్రముగాఁ దనియించి యమ్మహీ
భృజ్జనమౌళి నాఁటికి మ • ఱెవ్వియు గోష్ఠులొనర్ప కర్మిలిం
దజ్జనసంఘమెల్లను గ • తశ్రమమున్నిరసించునట్లు వ
లజ్జములన్ రసాయనము • లన్నమకూర్చెను జెక్కభంగులన్.

ఉ. అంతట నామె యున్నయెడ • కక్కయుఁ జెల్లెలునేగుదెంచి య
త్యంతముదంబునం గలసి • యచ్చట నుండఁగఁ దల్లి వారిశు
ద్ధాంతముఁ జేరఁ దెమ్మనుచు • దాసిక నొక్కతె నంప వారల
భ్యంతరమందిరంబునకు • నందఱు నేగిరి దాని వెంబడిన్. 121

శా. ఆరేయిన్ సుఖనిద్రఁ జెంది మఱునాఁ • డర్హక్రియల్ దీర్చి చె
ల్వారన్ విందుల నారగించి ముదిత • స్వాంతంబుతో నందఱున్
రారాజద్గతి నున్నవేళ స్మితవ • క్త్రశ్రీ దలిర్పన్ మహా
దారత్వంబున భావయాంబ యలసీ • తయ్యాంబతో నిట్లనున్.

శా. ఏరీ నీదు కుమారికామణులు రా • రేమమ్మ యిచ్చోటికి
న్నారిం జక్కనిచక్కలంచు వినుచుం • టం జూడఁగా వేడుకల్
దోరంబయ్యెఁగదమ్మ యమ్మగువలం • దోడ్తెమ్మ వేగమ్మనన్
స్మేరంబైన ముఖమ్ముతో నరిగెఁ బే • గ్రిం దానె సంతుష్టియై.

ఉ. బంగరుబొమ్మలో కుసుమ • వల్లరులో తొలుకార్మెఱుంగులో
రంగున మార్దవంబున మె • రుంగున నీ జవరాండ్రటంచుఁ జూ
డంగలవారలెల్లఁ బొగ • డందగు భంగి నలంకరించి ర
య్యంగనలం జతుర్విధము • లైన ప్రసాధన సాధనంబులన్. 124

క. చెలువంబునఁ గైసేసిన
చెలువలఁ దోడ్తెచ్చె వాణి • సిరి శర్వాణిం

దలఁపించువారి వారిజ
దళలోచన సీతయాంబ ♦ తన కొమరితెలన్. 125

ఉ. వచ్చుచునున్నవారిఁ గని ♦ బాపురె యాపురుహూతుఁ డేలు రా
లచ్చికి నెచ్చెలుల్గద వి ♦ లాస కలోపమశోభ నంచు లో
నచ్చెరువంది ముచ్చటగ ♦ నారయుచుండఁగఁ దల్లి వెంటరా
నచ్చపలేక్షణ ల్మువురు ♦ నచ్చటికిం జనుదెంచి రొద్దికన్. 126

గీ. వచ్చి తమతల్లియానతి ♦ భానయాంబ
చెంతనిలిచిన కన్నెలఁ ♦ జేరఁదివిచి
యోఁ దలంచిన పగిది ని ♦ య్యిందుముఖులు
ముగురువరులకు మువ్వురుఁ ♦ దగుదురనుచు. 127

క. తనలోఁ దనియుచుఁ దనచెం
తన లోపమలోచనలను ♦ దగ నిలిపెను బే
మను జాతరూపపీఠుల
మనుజాధిపు జనకు మాత ♦ మగువల ముగురన్. 128

వ. ఇట్లు నిలిపి. 129

గీ. చిన్నికన్నెలార ! ♦ చిన్నారి పొన్నారి
ముద్దుగుమ్మలార ! ♦ మువురిపేరు
లెవ్వియొక్కొ వార ♦ లే తాము వేర్వేరఁ
దెలుప వినఁదలంతుఁ ♦ దెలుపరమ్మ. 130

క. అన విని యీషల్లజ్జా
వనత స్మితవదనలైన ♦ వారలఁ గని త

జనని యిది యేమి సిచ్చితిఁ
గొనఁదగునే పేరుఁదెలుపఁ ♦ గోరిన మాత్రన్ 131

గీ. ఈమె యెవ్వరనుచు ♦ నెంచితి రీరు న
న్నెట్టు లట్టు లాత్మ ♦ నెన్నవలయుఁ
బెద్ద లెద్దియైన ♦ ముద్దుగా నడిగిన
నుత్తరంబొసంగ ♦ కునికెతగునె. 132

చ. అనవుడు ముప్వురు న్వరున ♦ నాత్మసమాఖ్యలఁ దెల్పునంత న
వ్వనితల సుస్వనంబులకు ♦ భావ మభావ మతిప్రమోద భా
జనమయి యొప్ప నప్పరమ ♦ సౌమ్యగుణాకృతులం గనుంగొనం
దనమది నిశ్చయించిన వి ♦ ధంబున నుండి రటంచు నెంచుచున్.

వ. వారిలోన. 134

ఉ. మంగళలాంఛనంబుల స ♦ మంచితలీల నెసంగుచుంటచే
మంగళదేవతాకృతి స ♦ మగ్రముగాఁ గనుపట్టుచున్న యీ
మంగయ పీఠికానగర ♦ మండలమేలు నృపాలమౌళి య
ర్ధాంగరమాత్వముం బడయు ♦ నట్టి శుభాంగిగ నిశ్చయించుచున్

మ. తమపేర్లెవ్వియటన్న మాత్రమున నీ ♦ తన్వంగు లీరీతి వ్రీ
డమొగంబు ల్వగ వంచి రీరెవరిచె ♦ ట్టంబట్టఁ గాంక్షింతురో
కొమలారా! యనునంత నెంతమది ని ♦ గ్గుందాల్తురో యమ్మ! నీ
తమ! యీశీతమయూఖబింబముఖు లే ♦ తన్మాత్రలే చూడఁగన్.

చ. వరుసలనేకము ల్గలవు ♦ వాని నటుండఁగనిమ్ము మాకు నీ
హరిణవిలోకనల్ మనవు ♦ రాండ్రగుదుర్గదవమ్మ! నికుర్వం

బరయఁగ నీదువావి నెన • రై తగు పెళ్ళికుమారు లియ్యోడం
బరగఁ బరిగ్రహింపఁదగు • ప్రాయముఁదోఁచుఁగదమ్మ! వీరికిన్.

వ. అనిన. 137

క. మనుమల పితామహీ నె
మ్మనమున నీమనుమరాండ్ర • మాతామహినై
తనరుచు నెఱుంగవా యి
వ్వనజేక్షణ లెవరిచెట్టఁ • బట్టఁదగుదురో. 139

క. నాతోడికోడలును మీ
రేతీరునఁ దలఁపు నిశ్చ • యించితి రటులే
నాతలఁపును మీయల్లుఁడు
భూతలపుని తలఁపుననుచు • బుద్ధిఁ దలఁపుమీ. 140

వ. అనిన నామె యిట్లనియె. 141

ఉ. చల్లకునేగుదెంచికల • శంబును దాఁపఁగ నేలనాదుమే
నల్లునకుం ద్వదగ్రసుత • నవ్వలికన్నియ లక్ష్ముదంబుతో
భిల్లఁగమత్తనూభవుల • పెద్దకుమారులకుం గ్రమంబునం
బెళ్ళియొనర్పఁగాఁ దలఁచి • మేమిటవచ్చితిమమ్మ యిమ్మెయిన్.

క. అనియిటుపలికినమాటకుఁ
దనివిన్మినన్నందికొనుచుఁ • దచ్ఛుభవార్తం
దనపతికి విన్నవింపఁగఁ
బనిచెందనచెంతనున్న • పరిచారికలన్. 143

క. అంతట నచ్చెంతసభా
భ్యంతరమున నున్నయన్న • రాధిపుఁ డవ్వృ
త్తాంతము విని యెంతయు నన
కాంతలకుం బారితోషి • కంబు లొసంగెన్. 144

శా. నా మేనల్లుఁడు సర్వలోకహితనా • నాకార్యనిర్వాహకో
ద్దామశ్రీచెలికాని వంశజుఁడు ప్రో • ద్యద్ధర్మశీలుండు నా
శ్రీమద్వేంకటరావు పౌత్రు లగునా • రిం జెప్పఁగా నేల శ్రీ
రామారావును సూర్యారావు ననునా • రలాత్రిజ చూడామణుల్.

క. మున్నుగ మేనల్లునకొక
కన్నియ మా రాజునకొక • కన్నియ యీఁగాఁ జెం
డ్లిన్నిశ్చయించి యవ్వలఁ
గొవ్వాళ్లకు నున్నకన్నె • కుంగూర్పనగున్. 146

క. రెండు దినంబులు నింకిట
నుండి బయల్వెడలి యేమ • యోధ్యాధిపతిన్
రెండవ వైకుంఠంబన
నుండిన భద్రాద్రిఁ గొలిచి • యురుతర భక్తిన్. 147

చ. క్రమముగ దివ్యదేశములఁ • గన్గొని పీఠపురంబు సొచ్చి యం
దమరఁగఁ జిన్నపెద్దలగు • నందఱు నియ్యకొనంగఁ దెల్పివ
ర్ణ్యమగు ముహూర్త నిశ్చయము • నర్చిపురోహిత విప్రముఖ్యయు
గ్మము వెసమీకుఁ దెల్పుటకుఁ • గానిటకంపెద నమ్మ సమ్మతిన్.

క. అనియప్పురిఁ జెప్పిన చొ
ప్పున నొప్పఁగ నెదలముదముఁ ♦ బొదలఁగఁ దలఁపు
ల్దనరఁగ నానరఁగఁదమి హె
చ్చను రెండు దినంబులుండి ♦ సపరి జనముగాఁ. 149

సీ. కనక ఘంటారణ ♦ త్కార నాదములోడ
బృంహిత ధ్వానము ♦ ల్వియ్యమందఁ
గింకిణీ ఘణఘణ ♦ త్కృతిరావములతోడ
హేషానినాదమ్ము ♦ లెనసి మోయ
యానభృత్కృత హుహో ♦ ధ్వానార్భటులతోడ
వందిస్తుతిధ్వను ♦ ల్పొందొనర్పఁ
బాదాతకోలాహ ♦ లోదారరవముతోఁ
దూర్యస్వనమ్ములు ♦ తొంగలింపఁ
గరులు హరు లందలంబులు ♦ కాల్బలంబుఁ
గదలు రొద తెల్ల దిక్కుల ♦ నదిమికొనఁగ
నడవి తెఱవునఁ బుడమి గ్రి ♦ క్కిదలనడచె
నెడనెడ కడిందిమెకములు ♦ జడిగి యడఁగ. 150

గీ. కొంతదూరంబు వెల్లంకి ♦ కులజమౌళి
యగు జగన్నాథ రాయేంద్రుఁ ♦ డాత్మసూను
ముఖులఁ గొందఱ సాగనం ♦ పుటకుఁ బంపఁ
దఱలి వారలు వీడ్కొని ♦ మఱలినంత. 151

క. గురుమను చాణక్యయుగం
ధర తౌల్యధురంధరోరు ♦ నయరీతి సమా
చరణా కరుణాదిగుణ

చ. సురుచిరపద్మనాయక వి ♦ శుద్ధతరోత్తమ వర్ణవర్ణితా
సురుజయపాత్ర ఖేచరల ♦ గోత్ర పవిత్ర నిజావతార సు
స్థిరవిభవాంక రావుకుల ♦ సింధు సుధాకర దానశౌర్య భా
స్వరగుణ రామరాయ సుత ♦ సత్తము సూర్యనృపాలకోత్తమా.

మాలినీవృత్తము.

సుమశరసమరూపా ♦ సుస్థిర శ్రీకలాపా
హిమవదుపమధైర్యా ♦ హీరవిస్ఫారశౌర్యా
ప్రమథితరిపుతేజా ♦ రావువంశాబ్ధిరాజా
సుమహితగుణసాంద్రా ♦ సూర్యరాయక్షితీంద్రా.

గద్య. ఇది శ్రీరామచంద్ర కృపాసాంద్ర కటాక్ష నిరీక్షణ సంలబ్ధ
శతావధానాది సరసతరకవితావిచక్షణ శ్రీమత్కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లి కులపయఃపయోనిధి కళానిధి సీతారామ
శాస్త్రి పౌత్త్ర వేంకటకృష్ణశాస్త్రి పుత్త్ర తమ్మనాభి
ధానాంతర వేంకటకృష్ణశాస్త్రి నామాగ్రజన్మ
త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బరాయ
నామధేయ ప్రణీతంబైన రామరాయ
విలాసంబను ప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.





శ్రీరస్తు.

శుభమస్తు, అవిఘ్నమస్తు.

# రామరాయవిలాసము

## తృతీయాశ్వాసము.



శ్రీమత్సుగుణసమాజా
భామాశ్రీమానినీజ ♦ భాస్కరతేజా
ధీమత్కవిజనభోజా
రామేంద్రతనూజ సూర్య ♦ రాయబిడౌజా. 1

గీ. అవధరింపుము దేవ ది ♦ వ్యానుభావ
యవ్వలి కథావిధానంబు ♦ నస్మదీయ
గురుముఖంబున వినినసై ♦ ఖరి సమగ్ర
విధిగ నానేర్చుపద్ధతి ♦ విన్నవింతు. 2

శా. ఆమార్గంబున నేగియోగి కనెసై ♦ న్యవ్యూహమంతంబలో
ద్దామద్వీపికపిద్విపర్క్షహరిణా ♦ దస్తబ్ధరోమాదిక

స్తోమాభీల మహాటవీగతి ముహు • ర్ఘోరప్రయాణోద్భవ
వ్యామర్ద శ్రమధూనన ప్రవణ భా • వంబై తమిన్ గౌతమిన్. 3

క. తద్దర్శనమాత్రంబున
దద్దయు నుద్దిఁ గనరాని • తనివిం గని యా
ప్రాన్దెల్ల నద్దళము లోఁగి
నద్దేవి యనుజ్ఞ వడసి • యద్దరి విడిసెన్. 4

మ. అదిగో బంగరు రంగనాయకు విమా • నాగ్రంబునం జక్ర మ
ల్లదిగో శంకరు దేవళంబుపయి దృ • శ్యంబౌ త్రిశూలంబు న
ల్లదిగో ముంగిట రామదాస ఘటితం • బై చొక్కమౌ గోపురం
బదిగో గౌతమి స్వామికోనెల యదే • వీక్షించి కేల్మోడ్చుఁడీ. 5

క. అటు లనుకొనుచుం బ్రభులకు
ఘటితోద్భట పటకుటీర • కటకస్థలమం
భటపటలి హయచ్ఛటకరి
ఘటయుం గోటవలెఁ జుట్టుఁ • గాపయ్యె నిశన్. 6

ఉ. ఆమఱునాఁటి రేపకడ • నాపగఁ దీర్థములాడి కూడి స్వ
స్వామిని మున్నుగాఁ దరలి • బాంధవ మంత్రిముఖాఖిలప్రజ
ల్సామజ యానపాత్రముఖ • సాధనతీర్ణ సరిఝ్ఝరీకులై
క్షేమము మీఱ నవ్వలని • కెం జని యందఱు నందు ముందటన్.

ఉ. కాంచి రుదంచితోరు మణి • కాంచనధాతు గుహావిశాలమం
బంచవటీ తటీనికట • భాగనభోగ శుభాగవల్లరీ
చంచల చంచరీక విల • సద్గరుదంచల కాంతిమండలీ
కంచుకితాభ్రసంచయ ని • కామవినీలము భద్రశైలమున్. 8

చ. కనుఁగొని స్వామిమందిర శి • ఖాశిఖరాగ్రనిఖాతమౌ సుద
ర్శనమునకుం గరంబును ది • రంబగు భక్తిఁ గరంబు లెత్తి మ్రొ
క్కెనినరుఁ డొక్కఁడైనఁ గనఁ • గా వినఁగా నను గాళినైన లేఁ
డన వచియింపఁగావలయు • నాకలనాథుల మాటమాటికిన్. ౯

సీ. రామన్న విహరింప • రామదాసు ఘటించి
నాఁడఁట పెక్కు మం • డపము లిచట
నవల తానీషా స • మర్పించినాఁడఁట
నవరత్నమయభూష • ణములు హరికి
వాని బిబ్బీ లేదు • వారాల తొడవులుఁ
దాల్పఁ బంపిరఁట సీ • తమ్మ కెలమి
సంఘటింతురఁట య • శ్వారావు వారలు
సకలకైంకర్యము • ల్స్వామి కెపుడు
నహహ ! ప్రత్యక్షవైకుంఠ • మనుచు వినిన
భద్రశైలంబు సేవించు • భాగ్యమొదవె
నీమహాదేవి కరుణచే • నిప్పుడనుచు
మనములను సంతసిల్లి ర • జ్జనులు భక్తి. ౧౦

వ. ఇట్లు సభక్త్యున్మేషంబుగా నశేషవిశేషంబుల నయ్యోషాగణభూష
మణి తన యానంబుం జుట్టువారుకొని యప్పరివారంబు పురివారిం
పరాని కుతుకంబునం జననప్పు డట నెడనెడ భక్త్యావేశ పారవ
శ్యంబున నొడలు మఱచి రామనామసంకీర్తనంబుఁ గావించుచు
మండలప్రచారంబుగఁ బరంజ్యోతిర్భావనా వాహితభగవద్రూ
ప లోహ నాళస్తంభంబునకుఁ బ్రదక్షిణంబుగాఁ బరిభ్రమించు
భక్తసంచయంబు గొన్నిచోట్ల డంబుమీఱు తంబురంబూనిదా

రమయంబులగు చిఱుతలతోఁ దారస్వరంబులఁ దారకమంత్ర సారంబులగు గేయంబులం బాడుచుండ గొన్ని తావులఁ గొందఱు సకింకిణీ ఘణఘణాత్కార నాదంబుగఁ బాదంబుల సలయంబుగ వలయంబుగ నాడుచు రామదాసకృతంబులగు గానంబులం జేయుచుండఁ గొన్నియెడలఁ గొందఱు రామదాస బందీవాస మహాయాస నిరాసనాది రామవిలాసంబులఁ గీర్తించుచుండఁ గొన్ని మండపంబుల రామాయణ పారాయణ పరాయణులై శిష్ట జనంబులు గాలక్షేపంబులు సేయుచుండ నాలకించుచు నేగియేగి ముంగిట. 11

సీ. నలువౌ స్వరూపంబు ♦ నకుఁ బార్శ్వములయందు
శంఖ చక్రాంకము ♦ లొప్పారుమీఱ
మెఱుఁగారు కఱివన్నె ♦ నెఱ తిన్నియలమీఁద
సున్నంపుజేకలు ♦ చెన్నుమిగులఁ
బలుతెఱంగుల రంగ ♦ వల్లికల్ దీర్చిన
గృహబహిర్వీధి నా ♦ కిళులు దనర
గుమ్మాల పొదిగిళ్లఁ గోరగా నైచిన
నిద్దంపుటాకు పం ♦ దిళ్ళ సంగ
దారి నేగుచుఁ జూచినం ♦ తనె ప్రపత్తిఁ
బ్రజకుఁబొడ మించుమహిమ సం ♦ పదల మించు
వైష్ణవాగార వీధికా ♦ వాటి నొక్క
విపులధామంబునం దామె ♦ విడిసె నెలమి. 12

క. ఆనాఁటికెల్ల నచ్చో
స్థానాచార్యాది కార్య ♦ జనులేతేరం

గా నుచితప్రక్రియ స
న్నానాదులచేతఁ గడపి ♦ మఱునాఁ డెలమిన్. 13

సీ. పావనగోదావ ♦ రీవారియందుఁ దీ
ర్థములాడి ధాత వ ♦ స్త్రములు దాల్చి
ఫలపుష్పమాల్యాద్యు ♦ పాయనయుక్తులై
పూరుషుల్ దగఁ బాద ♦ చారులుగను
స్త్రైణంబు శిబికాస్థి ♦ తంబుగాఁ గోనల
దరికేగి యందు నం ♦ దఱును డిగ్గి
ముమ్మాఱు వలగొని ♦ ముదముతో గర్భాల
యమునకు సపరివా ♦ రముగ నరిగి
దేవి తిలకించె నందు దే ♦ దీప్యమాన
దివ్యమంగళవిగ్రహా ♦ ధికవిలాసుఁ
జారు కారుణ్యపూర వీ ♦ క్షణవికాసు
సౌమ్యగుణపూర్తి శ్రీరామ ♦ చంద్రమూర్తి. 14

చ. కనుఁగొని సాగిమ్రొక్కి పుల ♦ కల్మ్రలకల్మ్రయినిండఁజూపఁగాఁ
గనుఁగవ సమ్మదాశ్రువులు ♦ గ్రమ్మఁగ నెమ్మిగ భక్తిపారవ
శ్యనియతి దోఁపఁగా నెదుట ♦ నంజలి నెన్నుదుటన్ ఘటించియు
ల్లని వినుతింపఁగాఁదొడఁగె ♦ నయ్యమయయ్యమరప్రపూజితున్.
శా. రామా శ్యామలకోమలాంబుధరసు ♦ త్రామాశ్మ భాస్వద్వపు
ర్ధామా సేవకచిత్తధామ తులసీ ♦ దామాభిరామా లస
న్నామా శ్రీమహనీయదివ్యమహిమో ♦ ద్దామా జగద్రక్షణ
స్థేమా దైవతసార్వభౌమ కరుణా ♦ ధీయుక్తిమైఁ బ్రోవవే. 16

సీ. కరుణచేఁ గౌసల్య ♦ గర్భంబున జనించి
ముద్దుఁజూపిన దివ్య ♦ మూర్తిఁ జూచి
ఘనత నహల్యఁ బా ♦ వనురాలిఁ గావించి
యొప్పుఁజెందిన పాద ♦ యుగముఁ జూచి
రమణ జానకి కర ♦ గ్రహణంబుఁ గావించి
ప్రమదంబుఁజూపిన ♦ పాణిఁ జూచి
మునుమున్న హితముతో ♦ ముచ్చటింతు నటంచుఁ
బూనికఁ జూపిన నవ్వు ♦ మోముఁజూచి
యాప్తివహించి ప్రణమిల్లి ♦ యభయమడిగి
పలుకరింపఁగడంగి య ♦ ప్పరమసాధ్వి
స్వామి సాక్షాత్కరించిన ♦ పగిదిఁ గొంత
తడవు తద్ధ్యాననిశ్చల ♦ త్వముననుండె. 17

గీ. అందుఁ దీర్థప్రసాదంబు ♦ లంది యంద
ఱుఁదరలి క్షేత్రపాలకు ♦ నిందుమౌళి
నారసింహుని శ్రీరంగ ♦ నాథు భక్తిఁ
బరఁగ సేవించుకొని యింటి ♦ పట్టుకరిగి. 18

గీ. ద్విత్రిఘస్రంబులందు భ ♦ క్తిని వసించి
చెంచులిర్వురు మార్గద ♦ ర్శితవహింపఁ
బంచవటికేగి యచ్చటఁ ♦ బర్ణశాలఁ
గాంచివచ్చుచు మధ్య మా ♦ ర్గమున యందు. 19

క. జనకసుతాస్నాన సుపా
వనతా వినుతోష్ణకుండ ♦ భవ్యపదాలో

కనమునుబొనరిచికొని య
వ్వనితామణి మరలె నాత్మ ♦ పట్టణమునకున్. 20

ఉ. వచ్చుచునున్న వార్త విని ♦ పౌరులు బంధులు పుత్త్రపౌత్త్రుల
భ్యుచ్చయ వైభవంబు పొలు ♦ పొందఁగఁబొందుగఁగొంతదవ్వురా
నిచ్చ ముదంబుమీఱఁ బురి ♦ కేగి క్రమంబునఁ గోటఁజొచ్చి యం
దచ్చపుఁబేర్మి నంతిపుర ♦ మందలి మేడ వసించి రందఱున్. 21

క. అప్పటికప్పటి కపుడా
లొప్పగు నుప్పరిగలోన ♦ నుచితపు జలువల్
చొప్పడఁ బయనపుబడలిక
చొప్పడగఁగ విశ్రమించె ♦ సుఖమలరారన్. 22

సీ. ఆమహాగోదావ ♦ రీమాననీయప్ర
వాహకూలంకషా ♦ భ్యాగమంబు
నాయరణ్యానీప ♦ థాంతర ప్రోన్నత
ప్రస్నిగ్ధతరూ ♦ ద్భటవిధంబు
నాబంధువిరచితా ♦ త్యంతగౌరవపూర్వ
కాదరణాతిశ ♦ యక్రమంబు
నాభద్రశైలము ♦ ఖ్యశ్రీరఘూద్వహ
వాస దివ్యక్షేత్ర ♦ వైభవంబుఁ
జెప్ప నేమగుఁ గదిసి వీ ♦ క్షించితీర
వలయునని యింటికడనున్న ♦ వారితోడ
నయ్యయివిశేషముల ముద ♦ మాత్మఁ బెరయ
ముచ్చట లొనర్చికొనుచు నా ♦ ప్రొద్దుఁగడపి. 23

ఉ. అమ్మఱునాఁడు సమ్మతిగ ◆ నాత్మకుటుంబజనమ్ముతోడ న
య్యమ్మ ముదమ్మునన్ రసిర ◆ సాన్నములింపుగ నారగించి వీ
డ్యమ్ములొనర్చి పెండిలి యు ◆ దంతము దానపు డానతీవినన్
నెమ్మనమందుఁ గోరు సుతు ◆ నిం గని తెల్పఁదొడంగెనిమ్మెయిన్.

ఉ. అమ్మెయి నాఁడు బైల్వెడలి ◆ యందఱుముందిరువూరుఁజొచ్చు మా
ర్గమ్మునఁ గొంతద వ్వెదురు ◆ గాఁ దదధీశుఁడు దారపుత్త్రవ
ర్గమ్ములతోడ వచ్చి కడు ◆ గారవమొప్పఁగఁ గొంచు నేగి మ
మ్మిమ్మగు నిమ్ములందు విడి ◆ యింప వసించితి మెమ్మెమీఱఁగన్.

సీ. కమ్మతావులఁ గ్రమ్ము ◆ కజ్జముల్ జాళువా
తెలెలందు నిడుకొని ◆ తెచ్చువారు
పంచదారయు నాన ◆ వాలును బంగరు
గిన్నెలతో నొప్ప ◆ గించువారు
నారమాగ్గిన పండ్ల ◆ నారగింపఁగఁ బైఁడి
పళ్ళెరంబులఁ గొని ◆ వచ్చువారు
పరిమళసహితముల్ ◆ పరిశుద్ధజలములు
పచ్చలగిండీల ◆ నిచ్చువారు
నగుచు నెడలేక దొరలయు ◆ నంతిపురపు
టింతులయు వాసగృహముల ◆ కిట్టులట్లు
దిరుగుచునెయుండి రమ్మహే ◆ శ్వరుని యాజ్ఞ
యెట్టిదో కాని వారల ◆ భృత్యులెపుడు. 26

క. కరితురగభటాదులకుం
బరివారజనంబులకును ◆ బడవాళ్ళకునుం
బెరమానిసులకునెల్లం
గరమురవుగ దవసములను ◆ ఘటియించిరొగిన్. 27

శా. ఆయాబంధుజనాను బంధవిధమా • యాభృత్య సంప్రత్యయం
బాయాచాక్రపు బోనగత్తెలగుణం • బాయాను హృత్సౌహృదం
బాయాయంతిపురంపుటింతులును మే • మన్యోన్యమచ్చోటనా
రేయిన్ ముచ్చటగాఁగఁ జేరొక్రనుచుఁగూ • ర్మిం జేర్మిమైనున్నచోన్.

ఉ. నెయ్యము నూపుబంధురమ • ణీమణులందున మేలుబంతినై
వియ్యపురాలుగాఁదగిన • పెంపగు తొయ్యలిమిన్నయైన సీ
తయ్యను గాంచి నీసుతలు • దద్దయు ముద్దులగుమ్మలంచు నే
నియ్యెడ కేగుదెంచితిఁ గ • దే తిలకింపఁగ వారిచెల్వముల్. 29

ఉ. నావిని నవ్వికొంచు సద • నమ్మున కల్లనఁ దానయేగి లీ
లావహ భూషణావళుల • నంతకు మున్నె యలంకృతాంగులై
కేవల దేవకన్యకల • శ్రేణి యొనర్పఁగఁ జాలువారలన్
దా వెసఁదోడితెచ్చెగుణ • ధన్యలమాన్యల నాత్మకన్యలన్. 30

క. అనితన పౌత్త్రికులాగ్రిణిఁ
గనియనెఁ బైతెఱఁగు నీవె • కదవినిమదిలోఁ
దనియందగు దనియందగు
తన బందుగుఁడని ప్రియను • తలఁ జేరొక్రనుచున్. 31

క. వనితలలో శుభలక్షణ
వినుతలలో నంధ్రదేశ • విశ్రుత సకలా
వనితలలోకోత్తరనృప
జనితలలోఁగలరె యట్టి • చక్రని మగువల్. 32

గీ. అద్వితీయసుమ్మి • యాకన్నెమిన్నల
లో ద్వితీయయైన • లోలనయన

నీద్వితీయమైన ♦ నిక్రంబుగా నది
యలరు వలపుఁగలసి ♦ యలరుటగదె. 33

క. జడకందము నడకందము
కడుమందము చిందమున్న ♦ గందగుసొగసా
మెడకందము రదబృందము
నడుమన్ నడుమన్న సృష్టి ♦ నలువయె మఱచెన్. 34

క. పలికించిన మకరందం
బొల్కించిన పగిదినొప్పు ♦ నొకటొకటి యిటుల్
దిలకించిన నెందైనం
జెలి కించుకయైనఁ గొఱఁతఁ ♦ జెప్పందగునే. 35

గీ. కర్ణములఁజూడ శ్రీశోభ ♦ గానుపించుఁ
గరముల్కరయంగఁ బద్మమై ♦ ఖరినెసంగుఁ
గనులఁదిలకింపఁ గమలాభఁ ♦ దనరియుండు
లలన ముమ్మాటికి నిజమ్ము ♦ లక్ష్మిసుమ్ము. 36

క. వనజాక్షి నడుమునైఖరిఁ
గనమందురు లేనిదైన ♦ కతమునభువిలో
జనులందఱంతకన్నన
వని వరలక్షణముగనిన ♦ భంబనుట దగున్. 37

మ. చెలి చక్రందనపుంజొకాటమగువా ♦ సింజెప్పఁగా నేలభూ
వలయాధీశ్వర నీవె చూచెదవు ద ♦ త్పృత్యంగ శృంగారముం

బలుకులఁ జకోరపుఁ బంచదార పలుకు • ల్వాల్చూపులయ్యిందిరా
నిలయింబుల్గలయంబు జేక్షణలకు • న్నెయట్టి భాగ్యాంకముల్. 38

క. ఆముద్దుగుమ్మ చకోరిని
మోముంగనుఁగొన్నమాత్రే • మునుఁ జందురునకుం
దాముద్దుల చెలియలనని
వేమరునడుగక యొతెల్పు • వేయేమిటికిన్. 39

క. పదియాఱు వత్సరంబుల
యదిరాయదె రాజచంద్ర • యదిరా నీవా
మదిరాక్షిఁ బెండ్లియాడుము
మదిరాజిలరాజిలనుస • మంగొనఁగఁదగున్. 40

చ. అని తెలుపన్ విరాళిమది • నంకురితంబగుడున్ మనోజుఁడే
మనియనవచ్చు నచ్చిగురు • టాకుఁగటారిఁ దటాలునన్ గర
మ్మునఁగొని హుంకరించుచును • ముంగిటనిల్చెను రాజశేఖరుం
డనువెఱమాని ధీరమతి • యైనతిఁగూర్చుతలంపుపెంపునన్. 41

ఉ. క్ష్మాధవ యయ్యమాధవుఁడు • మాధవుఁడుందన సృష్టిగామిగం
గాధర రామసంజ్ఞ నరి • గా సృజియించెను నిన్ను వారిబిం
బాధరలానుమారమల • యంశలఁ బుట్టఁగఁ జేసెనచ్చెలిన్
వేధనవీను లెందును బ్రి • వీణులుగా భువివింత సృష్టికిన్. 42

చ. సరసిజ సంభవుండు నిజ • సర్గవిధాన నిదానతన్ జరా
చర భువనైక కర్తయయి • సారసనర్గము దానొనర్పమిన్

వరువడిపెట్టి యయ్యబల ♦ వక్త్రవిలోకనపాణి పాదముం
బరువడివ్రాసి నేర్చికొనె ♦ మాతృకమాతృకగాఁగ నేర్పునన్. 43

క. ఇవ్విధినవ్వనుతించిన
యవ్వసుధాధిపుఁడు భావ ♦ మనుమతిగనుటన్
నవ్వుమొగంబున నించుక
నివ్వటిలంజేసితెలుప ♦ నింపుముదమునన్. 44

చ. చతురతరార్థసంభవ ♦ చకక్రమ విభ్రమశాలియా పురో
హితయుగళంబు దాసజను ♦ లిద్దరనట్లు పరిగల్భదాసికా
ద్వితయమునొకర్నాఁడు శుభ ♦ వేళఁదగంబయనంబుఁజేసి యం
చిత పరివారయుక్తిఁబని ♦ చెంబహుమంగళ వస్తుసంగతిన్. 45

చ. తగినవచోనిసంభ్రమ ముచి ♦ తజ్ఞతదెల్పియు బల్విసీతియున్
నగధులలోనిక్రైనను జ ♦ నందగుచందము గల్గువారలొ
ప్పుగఁ బధ్యునంబులైవెడలి ♦ మోసలఁబార్శ్వముల న్వసీధునీ
నగనగరంబులంగ్రమము ♦ నంగనుచుంజని చొచ్చిరప్పురిన్. 46

క. తమరాకయా నృపాలో
త్తమునకు నెఱిఁగింపఁబనుపఁ ♦ దడవేటికి వే
గమె యయ్యంతుల నంతిపు
రమునకు మగవారినిటకు ♦ రప్పింపుఁడనన్. 47

క. సముచిత నైఖరివారలు
దమతెచ్చిన భద్రవస్తు ♦ తతిసంయుతులై
కొమలంతిపురికి మగవా
రు మహీపతిసన్నిధికి న ♦ రుగుదుంబ్రీతిన్. 48

చ. నరపతియాద్విజేంద్రులఁ బ్ర ♦ ణామపురస్కృతిఁ గాంచి స్వాగతం
బరసి సమంచితాసనము ♦ లందువసింపఁగఁ జేసి భృత్యులం
జిఱునగవొప్ప మీఱఁగని ♦ సేమము నారసి దూరవర్తులన్
సరసను సిల్వనానతియొ ♦ సంగియొసంగెడు సంతసంబునన్. 49

ఉ. మామకబంధుమౌళికిఁ గు ♦ మారమహీపతిరాయ హోళికిన్
సేమమె తత్తనూజులకు ♦ సేమమె వారికి మాకుఁదుల్యమౌ
పేర్మిదలిర్ప మోదమొద ♦ వింపఁగఁజాలెడు వృద్ధదేవికిన్
సేమమె బాంధవాళికిని ♦ సేమమె సేమమె మంత్రిపాళికిన్. 50

క. ప్రతిమాసము మితిఁదప్పక
భృతినెసఁగ నొసంగుచుండు ♦ నే మీధరణీ
పతిపోష్యుల కదిఫలతరు
తతికుదక ప్లుతిగతిన్ హి ♦ తంబిడుగానన్. 51

క. సచివులు శుచితాన్వితులై
స్వచరిత్ర పవిత్రముగః బ్రి ♦ జాపాలనధ
ర్మచయంబు నీతిఁబాయక
పచరింతురుగాదె పక్ష ♦ పాతరహితులై. 52

క. శాంతికపౌష్టిక విధుల
శ్రాంతముఁ దఱిమీఱకుండఁ ♦ జలుపుదురే కా
ర్తాంతికులుఁ బురోధసులుం
జింతిత ఫలసిద్ధిపొంటెఁ ♦ జిత్తములలరన్. 53

సీ. ఏహ్యాద్రువాహ్యాళి ♦ కేతెంచునేయోగి
పఠిజతెల్పికొను విన్న ♦ పములవినునె

విని లెస్సగా విమ ♦ ర్శన మొనరించునే
యొనరించి పాడిఁ ద ♦ ప్పనివిధంబు
గాఁ గర్జములఁ దీర్పఁ ♦ గావించునే స్వారి
కరుగనివాఁడు కో ♦ ర్కెలఁ దీర్చి
మనవులాలించునే ♦ జనములాలించునే
భారముద్యోగుల ♦ పైని జేర్చి
యూరకుండక యాలస్య ♦ ముజ్జగించి
చారదృష్టులఁ బ్రచ్ఛన్న ♦ సరణిఁ దెలిసి
కొనుచుఁ దప్పున్నఁ దొలఁగించి ♦ గుణులనందు
నిలుపుచుండునె మీ ధారి ♦ ణీశ్వరుండు. 54

ఉ. ఎప్పుడునుం జలాశయము ♦ లెల్లెడలం దుదకాన్వితంబులై
యొప్పునె ధాన్యసంచయస ♦ మున్నతిఁ గొట్టడముల్ దనర్చునే
యప్పుశతాంశవృద్ధిగద ♦ యం బ్రజకేఁ బడునే యథార్థమై
కప్పము గైకొనంబడునె ♦ కర్షక హర్షకర ప్రకర్షమై. 55

క. ఆర్యులకుఁ గలదె మన్నన
కార్యాకార్యములనారు ♦ గఱపుగతిం దా
త్పర్యమున మెలఁగు దొర యని
వార్యంబుగ లబ్ధయత్న ♦ ఫలుఁడగుఁగానన్. 56

క. దేవబ్రాహ్మణవృత్తుల
నేవిధమగు బాధయైన ♦ నించుకయేనిం
భావింపఁ బొరయకుండఁగఁ
గావించునె మీ విభుండు ♦ కడు భక్తిమెయిన్. 57

గీ. జ్ఞాతిబాంధవవర్యుల ♦ సంతతంబుఁ
గలసి మెలసి స్వతుల్యమా ♦ గౌరవమునఁ
దనుపునేకద మీ కేఁడు ♦ దానవార
లవసరంబైననిడువారు ♦ ప్రాణమైన. 58

క. విద్వత్కవిగోష్ఠుల భూ
భృద్వరుఁ డనుదినము నెఱపు ♦ నే సాదరుఁడై
తద్వర్తన మిహపర సౌ
ఖ్యద్వయ మిడఁజాలునట్టి ♦ దని తెలిసి మదిన్. 59

క. పరిజనముం బుత్త్రులవలెఁ
బరికించుచుఁ దత్కుటుంబ ♦ భారంబెల్లం
బరమకృపాపరమతియై
భరియించునె వాండ్రు నమ్మి ♦ వదలకయుండన్. 60

క. మూకాంధపంగుబధిరా
నీకంబుల నన్వహంబు ♦ నిచయంబిడి మీ
క్ష్మాకాంతుఁ డరసి కృపచే
సాఁకునె యది సర్వధర్మ ♦ శస్యంబగుటన్. 61

ఉ. ఉక్కివుఁ దూరికొక్కకరుఁ ♦ డుండి యలక్ష్యత సాధుబాధయే
తక్కక దీక్షఁబూనిన వి ♦ ధంబునఁ జేయఁగ వ్యావహారికు
లెన్నికొకనుభీతినో తెలివి ♦ లేమినో చెల్మినో వాని చెద్దుముల్
పోకకఁగనీరు వాని వెస ♦ భూపతి బాయఁగఁజేయునేకదా. 62

క. పత్తి హయ కరటి రథ సం
పత్తిసెలంగఁగ సమిద్ధ • పత్తి దొలంగం
దత్రత్సన్నాహము పెంపా
దాత్తక్రమ భంగి తనరఁగ • దా మీవీటన్. 63

ఉ. చెప్పరుగా రహస్యమని • చెంతకుఁజేరి ఖలుల్ నృపాలుతో
దప్పుడుమాటలన్ విని య • తండు విమర్శ మొనర్పకుండ లో
నొప్పుకొనండుగా యరసి • యొక్కటఁ గల్లగఁ దెల్లమైనచోఁ
దప్పక బుద్ధిఁజెప్పి తగు • దండనముల్ విధియించునేకదా. 64

క. రాజుల కపకీర్తులు క
ల్గెజపుమాటలను వినుట • నేకద యొదవున్
దాఁజెప్పవాని కేమి య
హా! జడుఁ డితఁడంచు లోకు • లాడుదురు విభున్. 65

చ. చనవరిమాట కల్లయొ ని • జంబొ యెఱుంగఁగ శక్యమౌనె యే
జనవరమౌళికైన నవి • చారవచశ్శ్రుతి యౌనె చారుఁడై
నను బరరాష్ట్రవృత్త కథ • నంబునకుం దగియుండు నెద్దియై
నను సరె పైవిమర్శన మొ • నర్పవలెన్ విభుఁ డెల్లభంగులన్.

చ. చనువుగలాఁడటంచు మహి • జాని రహస్యముఁదెల్ప నొక్కొకం
డనయతఁ దన్ను ఱేనికి వ • యస్యుఁడుగాఁబ్రజయెంచు గౌరవం
బున నని దాని కొంత వెలి • పుచ్చుచునుండును దానఁగార్యముల్
బనుపడకుండునట్టి నరు • లందరిఁ జేర్పకయుండునేకదా. 67

క. కడనున్న కృతజ్ఞునిఁ దన
కడనుండిన వానిసమము ♦ గాఁ జూచుచు మీ
రొడయఁడు దాక్షిణ్యం బే
ర్పడఁ బ్రోచునుగద తదీయ ♦ భావము లలరన్. 68

క. అన నాభూసురవరు లి
ట్లని రస్మద్విభునకుం ద ♦ దాత్మజులకుఁ ద
జ్జనయిత్రికిఁ దద్బాంధవ
జనులకుఁ దన్మంత్రులకును ♦ సౌఖ్యం బధిపా. 69

క. ఓ యధిప ! మీరలడిగిన
యాయుత్తమరాజధర్మ ♦ మలవడు టరుదే
వేయుముడుంగులు దోఁచున్
మాయేలికయందు మీఁదు ♦ మసగ్రావ పేర్మిన్. 70

చ. అన ముదితాత్ముఁడై దశర ♦ థావనినాయకమౌళి కైవడిం
దనయచతుష్టయం బెపుడు ♦ దద్దయు నొద్దిక నొద్దఁ బెద్దయుం
జనవును భక్తియున్భయము ♦ సమ్మతిగ్రిమ్ముఁగ నింపునింప మీ
జనపతికిన్ శుభాభ్యుదయ ♦ సంపద పెంపువహించునాపుడున్.

క. జనకుని కైవడిఁ బ్రజలన్
మనుచుచునున్నట్టి మీఁదు ♦ మన్ననగల మా
జనపతికి శుభములొదవుట
యనుమానమె మీఁదుపలుకు ♦ వ్యర్థంబగు నే. 72

క. మీయింటఁ గన్నెమిన్నలు
మాయేలికయింటి పుత్త్రి ♦ మణులకు నెనయా
ప్రాయమున నెసఁగుచుండుట
యే యధిప! శుభోదయంబు ♦ నెఱిఁగించుఁజుమీ. 73

క. మీముద్దుకన్నియలు ల
క్ష్మీమూర్తులు మానృపాల ♦ శేఖరు తనయుల్
శ్రీమన్మ్రకుందరూపులు
భూమీశ్వర! యిది శుభంబు ♦ పొందెఱిఁగించున్. 74

చ. అని తమ ఱేనిసేవకుల ♦ నారయఁగా రయమార వారు దె
చ్చిన శుభలేఖ నవ్విభుని ♦ చేతికొసంగి వినీతి నిల్వఁగై
కొని పయి కుంకుమాంకములె ♦ కోరికదీరుటఁ దెల్ప సమ్మదం
బునఁ జిఱునవ్వుదోఁపఁ దన ♦ ముంగిటిమంత్త్రినిగాంచియిట్లనున్.

క. నెయ్యంబుమీఱఁగా మన
వియ్యపువా రనిపినారు ♦ వేడుకతో నేఁ
డియ్యెడ కిదె శుభలేఖను
జయ్యన వినుపింపుమయ్య ♦ సభ్యుల కెల్లన్. 76

చ. అని వినుపింపఁగాఁ గొలువు ♦ నందలివారలు సంతసింపఁ జ
య్యన నవబోధసౌధమున ♦ కప్పుడె తచ్ఛుభలేఖ వారు దె
చ్చిన మణికాంచనాభరణ ♦ చేల ఫలాదిక భద్రవస్తువుల్
పనిచెను బోనగత్తెలె వి ♦ భావ్యముగా విపరింతురం చొగిన్.

ఉ. అంతకు మున్నె యవ్విభుని ♦ యానతి నంతిపురంబుఁ జొచ్చి రా
ట్కాంతలొనర్చు నాదరము ♦ గాంచి వసించిన చేటికావ్రయం
బెంతయు సంతసంబున ని ♦ జేశ్వరి పెద్దతికంబు నామెసా
మంతగుణంబు నామెగరి ♦ మంబును పేర్కొని యంత నెండియున్.

చ. తనయు విధేయవర్తన వి ♦ ధానముఁ బుత్రిపవిత్రభావమున్
మనుమల రాజసంబునుకు ♦ మారతీవియుఁ దెల్వి పెంపు నుం
జనువును బంధుగౌరవముఁ ♦ జక్కఁదనంబు జనానురాగముం
గనుఁగొని యామె చెందుకుతు ♦ కంబది యింతని తెల్ప నేర్తుమే. 79

క. అనివిన్నవించుచున్నెడ
దనయంపిన భద్రవస్తు ♦ తతితో నృపుడున్
జనిరొందన యంతఃపుర
మునకర్థజనంబుఁ గూడి ♦ మోసలనశుపన్. 80

గీ. వచ్చుచున్న కేనిఁ ♦ బరిచారికాదారి
కానికాయ మెదుట ♦ గవని మ్రోలఁ
గాంచి వేగ లోని ♦ కైరయేగి దేవుల
సన్నిధానమందు ♦ విన్నవింప. 81

చ. సరగున లేచి చూపుఁ దెర ♦ చాటున కుంజని భద్రపీఠముల్
వరుస నమర్పఁ జేసి యిరు ♦ ప్రక్కలయందునఁ బొంచియుండ న
న్నరపతి యేగుదెంచి రత ♦ నంబుల పీఠికపైవసింపఁగా
సరసల సారసేక్షణలు ♦ చామరముల్గొని వీచుచుండఁగన్. 82

శా. దేవేరుల్ దమకంబుమైనొక జర • చ్చేటీవతంసంబు చే
వేవేపంపినయట్టి యాకు మడుపుల్ • ప్రీతాంతరంగంబుతో
శ్రీవింగైకొనుచుందరస్మితమునా • టిల్లన్ నృపాలుండు మీ
దేవుల్ వియ్యపువారి దాసికలకా • ప్తిం దర్శనంబిచ్చిరే. 83

మ. శుభలేఖం దిలకించిరే భవుకవ • స్తుశ్రేణి వీక్షించిరే
యుభరాడ్ధామినులైన కన్నెలకు నం • దెవ్వారి కెవ్వెవ్వియో
యుభయుల్ చేడెలు విన్నవించిరె తద • శోదార సంతాన స
ద్విభవాదిస్థితులెల్లనుల్లమలరన్ • విజ్ఞప్తిఁగావించిరే. 84

ఉ. వారిపురోహితుల్ మనకు • వంద్యు లనింద్య చరిత్రులుత్తమా
చారులు సూరులంతిపురి • చక్రటికింజను దేరనస్గాలీ
చేరవనున్న వారటకుఁ • జేరఁగ రమ్మనవచ్చునే మొదే
వేరులసన్నిధిం దెలిపి • వేచను దెమ్మనిపంప వ్రేల్మిడిన్. 85

క. అది చను దేరకమున్నె
యదితిప్రతి మానమాని • తాపత్యలు స
మ్ముదితలయి యానృపాలుని
ముదితలు పతినుడులు వినిస • ముదితప్రీతిన్. 86

సీ. పరమపావనులైన • బ్రాహ్మణోత్తములఁట
వార్ధకోన్ముఖదశఁ • బరఁగుదురఁట
వియ్యాలవారలం • పించినవారఁట
ప్రాణనాయకుఁడిచ్చి • నానతియఁట
యాత్మేశుసన్నిధి • యందుదర్శనమఁట
తెరమఱుంగునకె యే • తెంచెదరఁట

యంతఃపురపరిచా ♦ రార్హవర్తనులఁట
మంగళోదరహాస ♦ మాగములఁట
యట్టిపూజ్యుల నిటకుర ♦ మ్మనఁగవచ్చు
ననఁగ మాయాజ్ఞగావలె ♦ నఁటసమస్త
ధర్మములెఱింగినట్టిస్వ ♦ తంత్రులైన
యధిపులకుమమ్ము నిటుగోరు ♦ టర్హమగునె. 87

గీ. చిత్తవృత్తి పరికారంబుఁ ♦ జేయఁగోరు
వారమనుచును బుత్తెంచు ♦ వార్త వినుచు
నుండుటనుజేసి యధిపుఁడ ♦ య్యువిదరాక
మున్నె తాఁబిల్వనంపెన ♦ బ్భూమిసురుల. 88

శా. ఆవిప్రుల్ సనుదెంచునంతట విభుం ♦ డర్ఘ్యోపచారంబులోఁ
గ్రీవంబీతములందు నిల్పి వినయ ♦ శ్రీగౌరవప్రోల్లస
ద్భావుండై భవదాగమంబు శుభసం ♦ పద్వైభవాభ్యున్నతు
ల్గావించుంగదయించుసంస్తవనస ♦ ల్లాపంబులం దేల్చుచోన్. 89

శా. వారల్సంతసమంది మీవినయసం ♦ పద్గౌరవంబేరికో
ప్పారుం బారములేనిమీగుణగణో ♦ దార్యాదికంబేక దా
స్ఫారశ్రీశుభ వైభవాభ్యుదయతే ♦ జస్స్ఫూర్తికిం గారణం
బో రాజేంద్రభవాదృశుల్గలరెయీ ♦ యుర్విం బ్రశంసింపఁగన్. 90

క. అనియిట్లన్యోన్యంబున్
వినుతుల నొక్కింతతడవు ♦ పెరనుడువులఁ బే
ర్కొనుచు నొకించుకసేపుం
గొనకొనుతమి ముచ్చటించు ♦ కొనుచో విప్రుల్. 91

క. భూవల్లభ మీతోమీ
దేవేరులు వినుచునుండఁ ♦ దెలుపుఁ డటంచున్
భూవిభులు మమ్ముఁ బనిచిన
భావుకవార్తలు వినంగ ♦ వలయుం బ్రీతిన్. 92

చ. ఇదిగన మార్గశీర్షమునఁ ♦ గృష్ణగరుత్సమయంబు పౌషముం
దుఁ దగదు మిమ్ము నచ్చటికిఁ ♦ దోడ్కొనియేగఁగ మాఘమాసముం
దుఁదనరు శుక్లపక్షపుఁజ ♦ తుర్థి వివాహపు సన్ముహూర్తము
ల్గుదిరెను గాన నిన్నెలకు ♦ లోపున సేచను దేరఁగా వలెన్. 93

సీ. కన్యాలలామ వెం ♦ కయాంబ మాదేవి
మేనయల్లునకు జో ♦ డౌనటంచు
శ్రీలక్ష్మి సరిఁబోల్చు ♦ బాలమంగయ్యాంబ
యాత్మపౌత్రునకు నీ ♦ డౌనటంచుఁ
జిన్నికన్నెలమిన్న ♦ చెల్లియాంబిక తత్పి
తృవ్యాగ్రసూనున ♦ కెనయటంచు
నిపుడగ్రతనయుల ♦ కిరువురకును గౌతు
క శ్రీఘటింపయో ♦ గ్యమగునంచుఁ
చిన్నపడుదుకుఁ జిమ్మటఁ ♦ గొన్నినాళ్ళ
జరుగ వైవాహికశుభంబు ♦ సలుపవచ్చు
ననుచు విశదీకరించి మి ♦ మ్మనుమతింపఁ
జేసి రాఁదగు నంచుఁ బం ♦ చిరిటు మమ్ము. 94

గీ. మఱియు హూణాధిపతులు సా ♦ మ్రాజ్యభార
మూనుటను జేసి వైవాహి ♦ కోత్సవములు

పీఠపురమందు నెఱపుట ♦ వేడ్క లెల్ల
దీరఁగావున నచటికే ♦ తేరవలయు. 95

చ. మొదలిటిరాజధానియయి ♦ పూర్వపురాజుల బల్మి కల్మికిం
గుదురయినట్టి చామరల ♦ కోటవసించు పురోధలందు ది
గ్విదితుఁడు వింజమూరికుల ♦ వేంకటరామయ నామసూరి ద
త్సదనమునందు నిన్నెల ము ♦ దంబుదగన్నివసింపఁగాఁదగున్.

మ. అని యీతీరున విన్నవించి భవదీ ♦ యాత్మానుకూల్యంబుచూ
ప్పని నిర్ణీతమొనర్చి వచ్చుటకు మ ♦ మ్ముంబంపి రిచ్చోటికిం
జననాథోత్తమ చిత్తవృత్తిగతి నా ♦ జ్ఞాపించి యంపింపుమీ
చనివృత్తాంతమెఱుంగఁదెల్పెదము యు ♦ ష్మద్బంధురాణ్మౌళికిన్.

చ. అన విని యమ్మహీశ్వరకు ♦ లాగ్రణి యిట్లను వారిచిత్తమే
యనువున నొప్పు నప్పగిది ♦ నస్మదభీష్టము నంచు నియ్యకో
ల్వనికి యొనర్పఁగాఁ జనుఁడు ♦ పెద్దలు వారికి మాకు నామె యె
ట్లనుమతిఁ జేయునట్టులె క ♦ దా చరియింతుము వార లేమనున్.

క. అని చందనతాంబూలము
లును సుమరస హిమజలంబు ♦ లును మణిభూషా
కనకాంబరముల నిడి య
మ్మనుజేశ్వరుఁ డనుప ననుప ♦ మంబగు ప్రీతిన్. 99

చ. వెడలి హుటాహుటిం బురి ప్ర ♦ వేశమొనర్చి ద్విజాదు లచ్చటన్
నడచినవార్త లాత్మనర ♦ నాథునికిన్ విశదీకరింప నె

కుఱ్ఱఁడు ముదమంది చామరల ◆ కోట పురోహితు నింట నుంటకుం
గడపని పూనిఁ సన్నాహన ◆ కృజ్జనులన్నియమించియున్న చోన్.

మ. పయనంబై హిత మంత్రి బాంధవ పరీ ◆ వారంబుతోడం బ్రియా
ద్వయితోఁ బుత్త్రులతోడఁ బుత్త్రికలతో ◆ దారిం బ్రజానీకముల్
నయనప్రీతిగఁ జూచుచుండఁగ జగ ◆ న్నాథక్షమానాథుఁడు
చ్ఛ్రియ మొప్పారఁగ నెగుదెంచి విడిసెం ◆ జామర్లకోటన్ వెసన్.

క. మంచిముహూర్తమునపుడుం
ఛించి విభూత్తముఁడు ముడుపుఁ ◆ ఓళ్ళారికిఁ గ
ట్టించి వెసఁ బెండ్లిపను లొన
రించుట కానతి యొసంగె ◆ భృత్యుల కెలమిన్. 102

క. వారలు వచ్చిన వార్తఁ గు
మారమహీపతి నృపాల ◆ మణి విని కుతుకం
బారఁగ నెదురేఁగనంజనె
భూరితరంబైన విభవ ◆ మున నిప్పగిదిన్. 103

సీ. మదపుటేనుఁగులపైఁ ◆ గుదురుకొల్పిన భేరి
కాదుందుభిధ్వను ◆ లగ్రిందుకొనఁగఁ
బవనాభిభావుకా ◆ జవనాశ్వముల నెక్కి
బంధుసందోహంబు ◆ బలసి రాఁగ
హృద్యాపదానాన ◆ పద్యపద్యములచే
వంది మాగధజనుల్ ◆ ప్రస్తుతింప

బహువిధాయుధ సము ♦ ద్వహమై కెలంకుల
తెంకల బలగ మ ♦ లంకరింప
నడుమఁ గడు మంచి చిత్రవ ♦ ర్ణముల యాన
మెక్కి భూలోకదేవేంద్రుఁ ♦ డీతఁడనఁగ
వెడలెను గుమారమహిపతి ♦ విభవడుండు
గోర్కె వియ్యాలవారి నె ♦ దుర్కొనంగ. 104

క. లలిఁ ద్రోవనూళ్ళఁగల ప్రజ
గొలువఁగఁ జామర్లకోట ♦ కుం జని వారిం
గలసి యుచితోపచారము
లలవడఁగ సుఖోపవిష్టు ♦ లై యున్నయెడన్. 105

ఉ. క్షేమముగాఁగ వచ్చితిరె ♦ సింధురసైంధవ యానబంధురం
బై మితిమించు మీబలగ ♦ మంతయు నెమ్మిగఁ జేరవచ్చెనే
యీ మన బంధువర్గమున ♦ కెల్లను స్వాగతమే పథిశ్రమం
బేమియు సోఁకలేదుకద ♦ యిచ్చొటు సౌఖ్యముగాఁగ నున్నదే.

క. అన విని కుమారమహిపతి
జననాయకమౌళిఁ గాంచి ♦ సమ్మోదముతో
ననియె నిటు జగన్నాథా
వని వరమణి మృదుల మధుర ♦ వాచారచనన్. 107

క. మీయాదరంబు పెంపున
నీయందఱితోడఁ గూడి ♦ యేము సుఖులమై
యీ యింట విడిసియుంటిమి
మా యింటంబోలె ముదిత ♦ మానసవృత్తిన్. 108

గురునింట సముల నధికుల
నిరవుగ విడియింపఁ జేసె ♦ వృద్ధాచారం
బరయ మన కెల్లనృపులకుఁ
బురోహితులు వృద్ధ కామ ♦ ముఖ్యులు గానన్. 109

మ. ఇటు లన్యోన్యముఁ గొంత సేపు తమిచే ♦ నిష్టప్రసంగైక లం
పటులై యుండ మహీపతీంద్రుఁడు నిజా ♦ మాత్యాదులం గాంచియి
చ్చట వీరుండిన యన్ని నాళ్ళును లుభా ♦ సంపూర్తిగాఁగూర్చి య
చ్చటిక్షీరెప్పటికప్పై తెల్పుఁడని యా ♦ జ్ఞాపించియుంచద్గతిన్.

గీ. తఱలి యంతట నిజ రాజ ♦ ధానిఁ జొచ్చి
వాసిమీఱంగఁ బంచప ♦ వాసరముల
కెలమి నొక్కొక్కసారిగా ♦ నేగుదెంచి
కాంచుచుండెను బాంధవ ♦ గ్రామణులను. 111

ఉ. అంతట శైశిరంబు హరి ♦ దంత లసత్కరిదంత కాంతికిం
దంతురతం ఘటించుచు ని ♦ తాంతముఁ గుంద లతాంతసంతతుల్
గంతుని శాతకుంతముల ♦ కైవడి నెల్లెడ నుల్లసిల్ల న
త్యంతముఁ గాంతమై తగె న ♦ నంతననంత శుభాగమస్థితిన్.

గీ. కొన్ని హేమంతచిహ్నముల్ ♦ గొనలు పాఁకఁ
గొన్ని వాసంతచిహ్నము ♦ ల్గుదురు చెంద
శైశిరంబొప్పు ననుయాయి ♦ సమభియాయి
బంధుసమ సేవ్యమానార్య ♦ వర్యుపగిది. 113

సీ. వాసంతపంచక ♦ వాసరంబుల కెల్ల
నగ్రగణ్యతఁ గాంచి ♦ యులరు నెద్ది

పరిణయోపనయన • ప్రముఖశుభక్రియో
త్సవరత్నములకు ని • ధానమెద్ది
రవిదీప్తి యొకింత • రాణించి ప్రబలఁగా
నాత్మపుష్పకృతశాణ • మైనదెద్ది
శైవలింగాంకురం • బావిర్భవము నొంద
పెరుఁగఁగఁ దొలకరి • వేళ యెద్ది
యుభయ సంధ్యాసమాన ము • హూర్త మెద్ది
యద్ది గనుపట్టు ఋతువుల • కనుగుణమ్ముఁ
డగుచు నాత్యుష్ణదివసమై • నాతిశీత
రజనియై ధాత్రిపై శైశి • రంబు మిగుల. 114

చ. తపనుఁ డొకింతసార్థకత • దాల్చెను గొంతహిమాంశుశైత్యముఁ
వ్యపగతమయ్యె నించుక ప • వల్కు దైర్ఘ్యము గల్గె రేలపెం
పుపశమనంబు నొందెనపు • డొకవిధంబున లోకమున్న ని
క్రపుమతిహానివృద్ధులిలఁ • గావడికుండలుగా వెసూడఁగన్. 115

సీ. కైరవేందీవర • కల్హారసౌరభ
సారభాసురజలా • శయచయంబు
బహుపుష్పఫలశాఖి • పానీయయవసేంధ
నాదిపదార్థ స • మంచితంబు
తక్రాజ్య నవనీత దధిమండ దుగ్ధగ
వ్యాదిద్రవ్యసౌలభ్య • వర్ణితంబు
క్రతుకరగ్రహణను • వ్రతదేవతాస్థాప
నముఖశుభోత్సవ • సముదయంబు

నగుచు సకలస్త్రీమానవే ♦ ళ్యాతిశాయి
నిఖిల సామంతజనదీన ♦ సర్వశేష
లభ్యసౌఖ్యానుమోదలీ ♦ లావినోద
కారణంబయి యొప్పుమా ♦ ఘంబు జగతి. 116

ఉ. ఎందునుగ్రొత్తచప్పరము ♦ లెందునుబచ్చని తోరణోత్కరం
బెందును దూర్యనిస్వనము ♦ లెందునుబంధుసుహృత్సమాగమం
బెందును దైవతోత్సవము ♦ లెందునువిందులొనర్చు విందులుం
డెంద్గమునందు మోదము ఘ ♦ టించును మాఘమునం బ్రజాళికిన్.

సీ. పానీయజలముల ♦ పైనాదగనుమించె
నెండసోఁకల్లనఁ ♦ జండమయ్యెఁ
జందనపంక చ ♦ ర్చలు హితంబుగఁదోఁచె
నంతర్గృహస్థితి ♦ యంతరించె
నవగాహనస్నాన ♦ మభిలషితంబయ్యె
దుప్పట్లపైఁ గూర్మి ♦ యొప్పతఱఁగె
రేలనీవలకు రాఁ ♦ బ్రీతియంకూరించెఁ
గుంపట్లసంపర్క ♦ మింపువాసె
సకలజనులకు మాఘమా ♦ సప్రవేశ
సమయమం దెల్లరకు నవ ♦ సరముకొలఁది
నుజ్జగించినవారల ♦ బుజ్జగించి
పరిచితుల నుజ్జగించుట ♦ ప్రకృతిగాదె. 118

సీ. పూర్వసంధ్యకుఁబూర్వ ♦ మునమకరంబాడి
యర్కకరర్కంధూష ♦ లాప్తిఁగ్రుంకి

వరభీష్మపంచక ♦ వ్రతనైష్ఠికత మించి
శివరాత్రిజాగర ♦ శ్రీ వహించి
కంకేళికాకోర ♦ కప్రాశనమొనర్చి
హోళికోత్సవమహా ♦ కేళిఁ బేర్చి
యచ్యుతుడోలావి ♦ హారలీలలఁ గాంచి
తనిబుజ్జుటలవసం ♦ తంబులాడి
హాళిహిందోళరాగంబు ♦ నాలపించి
యిహపరసుఖానుభూతికై ♦ యెల్లజనము
సమధికోద్యమ భరితమై ♦ సంచరించుఁ
గాన శిశిరర్తువనకెనఁ ♦ గాననగునె. 119

ఉ. పచ్చిక పైరులుం బెరుఁగఁ ♦ బండినధాన్యపునూర్పుకళ్ళముల్
పొచ్చెములేనియిక్షువులఁ ♦ బూనికఁ బానకమాడుగానుఁగల్
హెచ్చుగనొప్పుచప్పరము ♦ లెల్లెడఁ జల్లనినీటికాలువల్
ముచ్చటదీరఁ గన్పడను ♦ పున్ శిశిరర్తువునందుఁ జేలలోన్.

క. చేమంతుల పూబంతుల
చేమంతులొనర్చిగుట్టు ♦ చెడియట్టి తఱిన్
సీమంతినులకుఁ దీర్చును
సామంతజనంబుకుంద ♦ సరములఁ గినుకల్. 121

సీ. బలితంపుటాకుఁ దోఁ ♦ టలకు నీరెత్తనే
తముఁదోడు జనులగా ♦ నములసొబగుఁ
బొలిపెచ్చి కొలకురాఁ ♦ గొలుచుకళ్ళమునూర్చు
కాపుబిడ్డలగీతి ♦ కస్వనంబుఁ

బండినపైరెత్తఁ • బసరుపైఁ రేదఁగా
వలియున్న చెలులగీ • తులరవంబుఁ
జెఱకు గానుఁగు బెట్టఁ • జుఱుకు గానడిపించు
నైతనికులోనర్చు • పాటనులివుఁ
గూడి చిఱుచలి నిద్దుర • వీడలేని
పాంథజనముల మేల్కొల్పి • పైనములకు
హెచ్చరికఁ జేయు గ్రామ బ • హిర్విశర్ది
కాతతులనుంజి మాగధ • గీతులగుచు. 122

శా. తాదృ ఙ్మాఘసమాగమంబున నమా • త్యశ్రేణిసన్నాహముల్
మోదంబొప్పఘటింప రావుకులరా • ణ్మార్థన్యుఁడన్యోన్యమ
ర్యాదలీల్ల నెఱఁగఁ బెండ్లివారి నెలమిన్ • రావించిలోకోత్తర
శ్రీదుర్గంబున గారవించి విడియిం • చెం బంధుగేహంబునన్. 123

సీ. ఆహూత సర్వదే • శాగత చ్ఛాత్రసే
వితసూరి సంబాధ • విప్రగృహము
సపరివారాయాత • సామంత బంధురా
జన్యజనాక్రాంత • సౌధతలము
మణిహిరణ్మయవిభూ • షణ రాంక వక్షౌమ
వి క్రేతృ సమ్మర్ద • విపణివీధి
బహువినోదక్రియా • పారగమనుజసం
కులసత్త్రదేవతా • నిలయమఠము
పరిణయోత్సవ వీక్షణ • ప్రవణహృదయ
జాన పదమాన వాకీర్ణ • సకలసదన

బాహ్యవేదిక మగుచుఁ జూ ♦ పట్టె నప్పు
డప్పురోత్తంస మెప్పట్టు ♦ నందు నరయ. 124

ఉ. వచ్చిన మిత్త్ర బాంధవ నృ ♦ పాలక జాలక మప్డు కానికల్
దెచ్చిన మత్తదంతు లెడ ♦ లించెను దేఁటుల కాముసీటిచే
హెచ్చగు తమ్మితేనియల ♦ యొద్దడిఁ దోఁగిన డప్పి దైవమే
యిచ్చుఁగదా యుపాధి గల ♦ వేమియొనర్చ నదృష్టవంతులన్.

మ. హితరాజన్యు లుపాయనంబిడిన య ♦ శ్వేభేంద్రము ల్సేయు హే
షితముల్ బృంహితముల్ క్రమానుగతి ఘో ♦ షించున్ వరుండైన రా
సుతునింగూఱిచి యివ్వరుండుధనియం ♦ చుందానియంచున్ సమృ
ద్ధతరోచ్చస్వరరీతి భాస్వరముగాఁ ♦ దజ్జ్ఞుల్ ప్రహర్షింపఁగన్.

సీ. ఏమందిరముఁ జూడ ♦ శ్రీ మించు నూత్న సు
ధాలేప సిత బహి ♦ ర్ద్వారసీమ
మేబహిర్ద్వారంబు ♦ నీక్షింపఁ గల్పనా
కల్పోన్నతానల్ప ♦ కాయమాన
మేకాయమానంబు ♦ నీక్షింపఁ గోమలా
స్తోకపల్లవగుచ్ఛ ♦ తోరణంబు
లేతోరణముఁగాంచ ♦ నెడనెడ వేల్పు ద
ర్పణవినిర్మలదీప ♦ భాజనంబు
లెసఁగ నప్పట్టణంబునం ♦ దెల్ల యిండ్లఁ
బెండ్లియిండ్లవితాన శో ♦ భిల్లెనపుడు
నవనవాలంక్రియాధార ♦ ణస్వబంధు
జనసమాదరణోత్సాహ ♦ సంభ్రమముల. 127

సీ. దారుల బారులఁ ♦ దీరుగా గలయంపి
చల్లినపన్నీటి ♦ వెల్లువలయు
నంగళ్ళ ముంగిళ్ళ ♦ నలికి మ్రుగ్గిడిన క
స్తూరికాపంక క ♦ ర్పూరములయుఁ
బందిళ్ళయందిండ్ల ♦ ద్వారంబులం దెల్లఁ
గూర్చిన నవపుష్ప ♦ గుచ్ఛములయు
మేడల వాడల ♦ మించు తోరణగండ్ల
వ్యాపించు సామ్రాణి ♦ ధూపములయు
వింతతావులు లేని తా ♦ వింతయైనఁ
గలయఁ బరికింపలే దందుఁ ♦ గల యశేష
నిలయములయందు నయ్యెడ ♦ మలయ మెలమి
వెలయ నివసించె సౌరభ్య ♦ మొలయననఁగ. 128

ఉ. ఘోరిధణంధణాలుచ్ఛటు ♦ భూమి నభంబులు నిండ మెండుగా
భేరులు మ్రోయుచుండఁగను ♦ వీధి గతాగత యాన వాహకో
హోహూరవముల్ దలిర్పఁగ ని ♦ భోత్కరబృంహిత వాజిరాజి హే
షారవముల్ చెలంగఁ బుర ♦ మయ్యెడ నాదమయంబు నాఁదగెన్.

మ. మురళీమౌరజ కాహళంబు పట ♦ హంబు న్భేరి నిస్సాణముఖా
వళీభూతముగాఁగ నిస్వనముల ♦ త్యంతశ్రుతిశ్రావ్యమా
సరణిం గ్రమ్మఁగఁ జేయఁగా సవిధదే ♦ శగ్రామసీమంబుల
న్వరలీలన్ విననయ్యె నయ్యెడ జనా ♦ నందంబు సంధించుచున్.

సీ. కొందఱు దేవతా ♦ మందిరంబులయందు
సాభోగభోగమ్ము ♦ లలవరింపఁ

గొందఱు బ్రాహ్మణ ♦ సందోహ భోజన
సంతర్పణంబుల ♦ సంతరింపఁ
గొందఱు బాంధవ ♦ క్షోణీశ బృందంబు
నకు సువారముల సం ♦ దర్భపఱుపఁ
గొందఱు వికలాంగ ♦ కుల కన్నపానాది
సంరక్షణంబుల ♦ సంఘటింప
నాత్మవిభు చేత నియమితు ♦ లగుచు నపుడు
భక్తితాత్పర్య వినయ కృ ♦ పావిశేష
సంగతనిజాంతరంగులై ♦ సంభ్రమమునఁ
దనరు నుద్యోగిజనుల సం ♦ దడి దనర్చె. 131

ఉ. వచ్చు సభాజనంబుల స ♦ భాజనులై తగఁ గూరుచుండఁ దో
డ్తెచ్చెడువారు చందనముఁ ♦ దెచ్చియలందెడువారుఁ దమ్ములం
బిచ్చెడువారు సూనరస ♦ మిచ్చెడువారు హిమాంబుపూరముల్
హెచ్చుగఁ జల్లువారునయి ♦ రెల్లరు నయ్యెడ రాజవల్లభుల్. 132

మ. సుముహూర్తంబిదె నేఁటిరాత్రియని త ♦ జ్జ్యౌతిషు ల్విన్నవింప న్మహీ
రమణుం డల్లన రేచు పెండిలి యొన ♦ ర్పంజేసి యాపిమ్మటన్
గ్రమమొప్ప న్సతు వేడ్కఁ బెండ్లికొమరుం ♦ గావించిదీవించిమూ
ర్థముఁ బెంపించి వివాహవేదికను సం ♦ స్థాపింపఁజేసెం దగన్.

క. అంతటఁ బాదనఖంబుల
కృంతన మొనరింపఁజేసి ♦ శ్రీహరి రాణిన్
సంతసమున నిలిపి మహీ
కాంతుఁడు బాసికము నుదుటఁ ♦ గట్టించి రహిన్. 134

గీ. విడిది నీరేయి మున్న మీ ♦ పెద్దబిడ్డ
యైన శ్రీవెంకయాంబ మా ♦ మేనమఱఁది
యైన వేంకటరాయని ♦ కనువు మీఱఁ
బరిణయమ్మను గావింప ♦ వలయు మఱియు. 135

క. పిమ్మట రెండవసుత నచి
రమ్మగు లగ్నమున మాచి ♦ రంజీవికి నె
య్యమ్మున నొసంగి కల్యా
ణమ్ము శుభోదర్కముగ నొ ♦ నర్పఁగ వలయున్. 136

క. అని వియ్యంకుని చెంతకు
ఘనతందగు లగ్నపత్రి ♦ కం బనిచి తనూ
జుని యూరేగింపునకై
యనువుగ నాయితము సేయ ♦ నానతి నిడియెన్. 137

సీ. పదియాఱువన్నె క్రొం ♦ బసిడి యంబారీలఁ
గొన్నింటిపైఁ బాదు ♦ కొల్పువారు
జతనంపు సొంపుల ♦ రతనంపు హౌదాలఁ
గొన్నింటిపైఁ జక్కఁ ♦ బన్నువారు
సొగైనపనుల య ♦ స్తరుఁ బల్లకట్టులఁ
గొన్నింటి వెన్నంటఁ ♦ గూర్చువారు
హురుమంజి సరుల జా ♦ లరుల జూల్పట్టముల్
గొన్నింటిపై నెల ♦ కొల్పువారు
నగుచు గోరోచనాపరి ♦ స్థగిత చిత్ర
పత్రరచనాంకితంబులౌ ♦ భద్రకరుల

ననువు మీఱంగ మావంతు ♦ లనునయించి
పొంచి నెఱిమించఁగ నలంక ♦ రించిరపుడు. 138

ఉ. బింకపు టంకవన్నెలఁ ద ♦ విల్చిన పల్లములం బిగించి బ
ల్వంకపుఁ గల్లెముల్ దరటు ♦ లున్ మొగముట్టులుగూర్చి యంచితా
లంకరణంబులొప్పఁ బది ♦ లంబుగ సాహిణులప్పుడందు ని
ర్వంకలఁ బట్టినిల్పిరి దొ ♦ రల్నెరిమెచ్చఁగ వారువంబులన్. 139

గీ. అమితసంఖ్యంబు లగ్నియం ♦ త్రముల బండ్లు
చమురుడబ్బాలు నించిన ♦ శకటములును
బహుళముగ దండదీపికా ♦ వర్తులునిచి
రపుడు పడవాళ్ళు బండ్లపై ♦ నాయితముగ. 140

క. అందపుడు కుందనపుఁబని
యందపు టందలము లొఱపు ♦ లైనసవారీ
లుం దగ బెస్తలు గూర్చిరి
పొందుగ నాయితముసేసి ♦ భూపతులకునై. 141

మ. తళుకుం గెంపుల పైడిచుడ్డలును ని ♦ ద్దాపచ్చ డాల్డం డెలుం
గిలుకుం దంతపుఁగోళ్ళ వింతపని చ ♦ క్కీర్లెంజరీ పింజరీ
బలు రాయంచ గరుల్చెలంగు పరుపుం ♦ బాలీసునుంగూర్చి బె
స్తలు కళ్యాణపుఁ బల్లకీనిలిపి రం ♦ తఃకక్ష్యయందయ్యెడన్. 142

సీ. అంతట నొకర్రాజముఖి ♦ యంతిపురంబున రాజనందను
న్విoతచాకాటపుంబనుల ♦ పీఠికపై నివసింపఁజేసి తా
సంతస మాత్మనుప్పతిల ♦ సంపఁగె నూనియనంటెఁ బెన్నెఱు
లర్రంతుగుణంబులిట్టటు మె ♦ లంగక యుండఁగ మందుఁబ్రామెనాన్.

ఉ. కోమలి యోర్తు రాసుతున ♦ కున్మృదు సుందరమైన మేనగం
ధామలకంబు వెట్ట నొక ♦ యంగనయుం జతురోక్తి రూఢిగం
ధామలకంబు చేతనె నృ ♦ పాత్మజు నేనభిషిక్తుఁ జేయుదున్
లేమరొ యంచుఁ బల్కె యటు ♦ లే పచరించె సమంచితంబుగన్.

ఉ. కుంతలముల్ నృపాత్మజున ♦ కుం దడియార్పఁగఁ డంగి యొత్తె నీ
మంతిని యోర్తు నేర్పుమెయి ♦ నద్దిన కొంగున నద్దకుండ న
త్యంతము సన్నపున్వలిపె ♦ మల్లనఁ జొన్పిన కేల యామినీ
కాంత ఘనాంతరంబునకుఁ ♦ గౌముదిఁ బర్వఁగఁ జేసినట్లుగన్.

సీ. ఒయ్యారమొలయంగ ♦ నోరగా సిగనైచి
పువ్వుటెత్తులు చుట్టెఁ ♦ బొలఁతి యొకతె
నుదుటఁ జెన్నొదలర్పఁ ♦ గుదురుగాఁ గళ్యాణ
తిలకంబలవరించెఁ ♦ గలికి యొకతె
మెలపుతో వలపుతోఁ ♦ గలపంబు నెమ్మేనఁ
బొలపంబుగ నలందె ♦ వెలఁది యొకతె
రతనంబుల పొలరంగ ♦ జతనంపు టపరంజి
రవణముల్గయిసేసె ♦ సువిద యొక్కతె
తలను బాగయు మహతాబు ♦ నిలువుటంగిఁ
బచ్చపూవన్నెల షరాయి ♦ పావదోయి
చేరుమాలును మెఱుఁగునై ♦ జాడుఁ బతికి
సకియలు ధరింపఁగ నొసంగి ♦ రొకతె యొకతె. 146

శా. బింబోష్ఠీమణి యోర్తు రాసుతునకున్ ♦ వేవేగఁ బాగాలు వీ
డెంబుం జేతికొసంగ నందికొనుచున్ ♦ ఠీవిం జగాసోగమీ

సంబుం గోటనుద్దికొంచు దరహా ♦ స శ్రీల సద్వక్త్రుఁడై
యుంబౌ డంబున శంబరాహితునితో ♦ నీడౌనాయారంబునన్. 147

గీ. తరుణి యొకర్తు నిల్వుట ♦ ద్దంబుఁ జూప
నందుఁ బ్రతిబింబమును గాంచె ♦ నవ్విభుండు
స్వగుణ రూపాను రూపాను ♦ భావ భావి
సుతముఖాలోకనావాప్తి ♦ సూచకముగ. 148

ఉ. అంతిపురంబు వెల్వడిన ♦ యంతట వందులు ప్రస్తుతింప సా
మంతులునుం బురోధలు న ♦ మాత్యులు నున్నగవారు పల్లకీ
చెంతకుఁ దోడితెచ్చి నివ ♦ సింపఁగఁ జేసి స్వవాహనంబులా
ప్రాంతమునందు నుండినను ♦ బ్రక్కలఁ గాల్నడ నేగు దేరఁగన్.

గీ. తూర్యవాదక జనులు ముం ♦ దుగఁ గడంగి
నడువ నుత్సవ విభవ స ♦ న్నాహకులకు
మాత్రమల్లన నించుక ♦ మార్గమొదవ
నొక్కఁడిజనంబు లచ్చోట ♦ సేవసింప. 150

గీ. నడచు నుత్సవ జనకోటి ♦ నడచుచుండ
మొదలఁ గదలిన నగుబత్తు ♦ మదగజంబు
బిరుద వాదిత్రములతోడఁ ♦ దిరిగివచ్చి
గవనికడనిల్చె లోనికే ♦ గ నెడలేక. 151

ఉ. అల్లనఁ బల్లకిందిగి స ♦ మంచిత కౌతుక విభ్రమంబు శో
భిల్లఁగఁ బావలందొడిగి ♦ భృత్యుల కేలవలంబనంబుగా
వెళ్ళి కుమారుఁడప్డ యొక ♦ పీఠమునందు వివాహమండపం
బెల్లఁ బురోహితాప్తబుధ ♦ బృందము నిండ వసించె ఠీవితోన్. 152

శా. నవలాలప్పుడు రాణివాసమునఁ గ ♦ న్యాలోక మూర్ధన్య స
న్నవలావణ్య వయోవిలాసగుణ ధ ♦ న్యన్ మాన్యసౌజన్య మా
నవరాజన్యుని కన్నమున్నె యనుపం ♦ దన్మంగళస్నాతఁగాఁ
గ వెసంజేసి చతుర్విధంబుల నెఱిం ♦ గై సేసిరందంబుగన్. 153

చ. అపుడు ప్రధానకృత్యము మ ♦ హార్హమణీమయ భూషణాంబరా
ద్యపరిమితార్థ సంచయ స ♦ మర్పణముఖ్యముగాఁ బురోహితుల్
నిపుణతఁ బేర్చుదాసికలు ♦ నీటుగఁ బెండ్లికుమార్తెఁ దెచ్చి యు
చ్చపు సిరికైవడిన్ నిలుపఁ ♦ జల్పిరి గౌరిసమర్చమున్నుగన్.

స్రగ్ధర. అంతన్ మౌహూర్తికప్రా ♦ హముగడఁగి తద ♦ ద్యక్షులం డాసిలగ్నా
పాంత్యంబౌ వేళయయ్యెన్ ♦ వ్యవధిమిగులలే ♦ దంచుఁ దెల్పంగ దాసీ
కాంతాళిన్వారువంపం ♦ గడుపవడిఁ జనియా ♦ కన్యకారత్నమున్ శు
ద్ధాంతంబందుండి యొకిం ♦ తయుఁ దడయక మో ♦ దంబునం దోడితేరన్.

చ. గుభలుగుభల్ ఘణంఘణయు ♦ గొబ్బున భోరని మిన్నుముట్టదుం
దుభిముఖ వాద్యనాదముల ♦ తో నలతోరపుఁ గాహళాదులున్.
శుభగతి నేకనాదమయి ♦ చొప్పడ నప్పుడు సంభ్రమంబుతో
నుభయులు పెండ్లివారు సుము ♦ హూర్తము డాసెనటంచు నందడిన్.

మ. ఫలతాంబూల పటీర కర్దమ హిమాం ♦ భస్స్నాన మాలానము
జ్జ్వల కాశ్మీర నిశాసితాభ్రగుళికా ♦ ప్రసృష్ట తైలాంబరా

వళి భూషాగురు ధూపవర్తిముఖ భ ♦ వ్యద్రవ్యముల్ జాళువా
తెలెలందుంచి యమర్చిరందు శుభవే ♦ దిక్షోణికిర్వంకలన్. 157

సీ. మధురాసకృత్పత్య ♦ మానలగ్నాష్టక
హితమతోభయ పురో ♦ హితకులంబుఁ
బశ్చాత్పదశుభాంక ♦ పదగీతికాలోల
వృద్ధభూసుర పురం ♦ ధ్రీచయంబు
సిద్ధఫలామితా ♦ శీర్వాద దానకాం
క్షాసన్నివిష్టార్థ ♦ సభ్యగణము
జయవిజయస్వోతి ♦ శబ్దాసకృద్గుణౌ
ఘస్తోత్ర వందిమా ♦ గధ జనంబు
నయిన కళ్యాణ మండపా ♦ భ్యంతరమునఁ
జుట్టుఁ జుట్టంబులును జెలు ♦ లిట్టతనము
లమరఁ గేలూని కాలాని ♦ యట్టులెత్తి
చెలువమును జూడ వేడుక ♦ నిలుచునంత. 158

మ. బురకాలోని విపంచిపోలిక మణీ ♦ పుంజావృతంబైన పం
జరమందున్న శుకీవతంసము గతిన్ ♦ సాంద్రాంబుభృన్మండలాం
తరమందొప్పు మెఱుంగుఁబోలె దళ్లీ ♦ నంబైన పూగుత్తినాఁ
దెరతో నచ్చటి కిచ్చఁదెచ్చెను బురం ♦ ధ్రీశ్రేణి యక్కన్యకన్.

గీ. అపుడు మామవంక ♦ యనుచరుం డొకరుఁడు
గడఁగి పెండ్లికొమరు ♦ నడుగుదోయిఁ
గడిగి తడియడంగ ♦ మడుఁగుచే వడినొత్తి
తొడరి పావజోడు ♦ దొడుగఁ దొడఁగ. 160

వేదీ ప్రదక్షిణత్రయ
మాదిం దాంబూలఫల స ♦ మంచితకరులై
యాదంపతు లొనరించిరి
భూదేవ స్వస్తివాద ♦ పూర్వక సరణిన్. 161

నానికిఁ గట్టనిచ్చెఁ జెలు ♦ వంబగు మేలిజరీ మడుంగులన్
వానికిఁ జుట్టుకో నొసఁగెఁ ♦ బాగగ బాగగు పట్టుఁబుట్టముల్
వానికరంబులఁ దొడుగఁ ♦ బంచెను బైఁడి కడెంబులన్ మహీ
జాని యుదారులన్యు నుప ♦ చారము నూరక యీయకొందురే.

కౌతుకవేదియందు మణి ♦ కాంచననిర్మిత భద్రపీఠి ను
ద్యోతిత వైభవాఢ్యుల వ ♦ ధూవరుల న్నివసింపఁజేసి వి
ఖ్యాతవిధిం బొనర్చిరి గ ♦ జాస్యుని పూజనముం బురోహితుల్
జాతకుతూహలాత్ములగు ♦ సభ్యులయానతినొంది ముందుగన్. 163

క్షితిపతి సూనుఁడు దాన
వ్రతమున కదిమొదలు ప్రతిన ♦ వహియించిన ప
ద్ధతిమున్నె కుడికరమ్మునఁ
బ్రతిసరముం దాల్చె ధర్మ ♦ పత్ని వరింపన్. 164

పతిపాదయుగళసేవా
వ్రతమున కెదిమొదలు దీక్షఁ ♦ బట్టఁగవలయున్
సతియని యెరులకుఁ దెల్పెడు
గతినపుడక్కన్నె బద్ధ ♦ కంకణ యయ్యెన్. 165

దైవజ్ఞుల్ దఱియంగఁజొచ్చి సుముహూ ♦ ర్తంబిప్పుడేయంచు మే
ఘావైశద్యమెలర్పఁ దెల్పఁగ బురో ♦ ధశ్శ్రేణి లగ్నాష్టక

వ్యావృత్తిం గుడజీరకంబులు శిరో ♦ భాగాంతరన్యస్తముల్
గావించెన్ వెసనవ్యభూవరులచేఁ ♦ గళ్యాణ సంసిద్ధిగన్. 166

క. మంగళసూత్రము శుభగరి
మంగళ సూత్రితముఁ జేసె ♦ మహనీయ ప్రే
మం గమనీయత్వరతికి
మంగమకున్ రామవిభుఁడు ♦ స్మరనిభుఁ డంతన్. 167

సీ. కౌదలపైనుంచి ♦ నప్పుడు జీమూత
జాతజాతఖ్యాతి ♦ సంగ్రహించి
వేణీభరమునుండి ♦ వెలువడుచున్నప్పు
డహిసంభవత్వంబు ♦ రహివహించి
కనుఱెప్పలందుండి ♦ యినుపొప్ప జాఱుచో
మత్స్యసంభూత సం ♦ పదవహించి
గళసమీపమునుండి ♦ గళితంబులగుతఱి
శంఖోద్భవఖ్యాతి ♦ సంతరించి
వరుఁడు దోయిళ్ళఁ గీలించి ♦ వడిగ నించు
సేసముత్తెంబు లత్తఱి ♦ శిరమునందుఁ
గ్రమ మెలర్పఁగ జన్మదే ♦ శములనుండి
యప్పుడప్పుడు వెలువడు ♦ చొప్పుదోఁచె 168

ఉ. భావములోని మోహగుణ ♦ బంధము బంధురమయ్యె నిట్లునా
భావజుఁ డాత్మలీలఁ గను ♦ పట్టఁగ గట్టిగఁ గట్టిపెట్టెనా
భావిసమస్త ధర్మములఁ ♦ బాయక వీరికి సంతతావినా
భావముగల్గు నాసతికి ♦ భర్తకు బ్రహ్మముడుల్గడుందగన్. 169

బొందుగఁదాల్చి షడ్రుచులఁ ♦ బొల్పగు విందుల నారగించి కీ
ల్పొందగ సద్వినోదకర ♦ లోకవిలోకన వృత్తి సేయఁగన్. 173

సీ. కళుకు పచ్చలతీవ ♦ లలరు కెంపులపూవు
లొలయు బంగరుపండ్లు ♦ వెలయు పనుల
జిలుగుఁదోరపు వజ్ర ♦ ములనిగారపుగోడ
ఎసఁగు ముత్తెపుఁ జూర్లఁ ♦ బొసఁగు పసలఁ
బొలుచు నీలపుఁగంబ ♦ ముల చొకాటపుడంబు
గలజగా పగడంపు ♦ గడపలొఱపు
మెఱుఁగు నిద్దపుఁ బొల్పు ♦ పఱఁగు నద్దపుఁ దల్పు
లమరు తోరణగండ్ల ♦ కొమరుమిగులు
లలిత విజయాంక లక్ష్మీవి ♦ లాస విభవ
శాలి కల్యాణ వేదియా ♦ నాలుగిండ్ల
వాకిటఁ దవాసుపై వెల్ల ♦ ఫర్షమీఁది
యందపు ఫసందుగల మస ♦ లందునందు. 174

సీ. చిన్నారి పొన్నారి ♦ మిన్నారవలతాజు
మణికిరీటముచాయ ♦ గణుతి సేయ
రంగారు బంగారు ♦ పొంగారు భుజబందు
ధరజాళువాపీతి ♦ కరణిఁదోప
జగజంపు వగసొంపు ♦ జిగికెంపు టుంగరం
బధికారముద్రిక ♦ హరువు నెఱప
మగరాల జిగిరాలు ♦ దగుమేలి మణికట్టు
గురుదాన కంకణ ♦ స్ఫురణఁదాల్పఁ
బొల్పగు ననల్ప కల్పనా ♦ కల్పకలన
వలనఁదులనాతిగంబెన ♦ చెలువు కలిమి

లలిమిఁ టారించు బలవైరి ♦ వలె రహించు
గారవముఁ బేర్చి పేరోల ♦ గంబుదీర్చె. 175

క. ఇరుసరసలఁ బరిసరముల
నిరువురు పురుషులు వినీతి ♦ ధృష్టులు మణిభా
స్వర కార్తస్వర దండ
స్ఫురదురు సితచామరములు ♦ పొలుపుగ వీవన్. 176

క. నిండగు ఠీవిని విభవా
ఖండలుఁడగు నన్నృపాల ♦ క శిరోమణి యా
తండప్పుడందు డెబ్బది
రెండునియోగములవారు ♦ క్రేవల నిలువన్. 177

సీ. చాంపురాంచల మరు ♦ త్కోమలాంకురచల
న్మస్రణాసితశిఖండ ♦ మండలుండు
మందహాసచ్ఛద్మ ♦ కందళచ్చంద్రికా
మహనీయముఖచంద్ర ♦ మండలుండు
సుకపోలతలకీర్ణ ♦ చకచకద్యుతిపూర్ణ
గురువజ్రమయ కర్ణ ♦ కుండలుండు
వీక్షణామృతరస ♦ ప్రేక్షణాద్భుతమన
స్స్ఫురణాప్త శుభనేత్ర ♦ పుండరీకుఁ
డనుచరాకల్పిత ముహుస్స ♦ మర్ప్యమాణ
సరస ఘనసారముఖ గంధ ♦ సారవస్తు
మిళిత వీటీ పుటీ పరి ♦ మిళిత లలిత
కలిత దిఙ్మండలుండునై ♦ చెలఁగుచుండె. 178

మ. అలఘుప్రౌఢిమకోటిఁ గైకొని యుప ♦ న్యాసంబుఁ గావించి యు
జ్జ్వలమౌ ధారణపెంపుచే ననుపదం ♦ బం బూర్వపక్షంబు ని
శ్చల సిద్ధాంతము సేయఁగా నిపుణులౌ ♦ షడ్దర్శనీపారదృ
శ్వలు విద్వాంసులు వాక్ప్రసంగముల నేర్పుల్సూపనాలించుచున్.

సీ. షడ్జర్షభాదిక ♦ స్వరజనిస్థానముల్
తత్తత్స్వరములు ప్ర ♦ స్తారకలన
నగుమేళకర్తలం ♦ దమరు రాగముల సం
పూర్ణషాడభ భావ ♦ ముఖ్యభేద
ములను దత్తద్గాన ♦ ముఖ్యకాలంబుల
లయతాళ మూర్ఛనా ♦ లక్షణముల
గ్రామద్వయోద్గీతి ♦ కా ప్రౌఢిమంబుల
దశవిధగమక ప ♦ ద్ధతుల నెఱిఁగి
రక్తిమీఱంగ హాయిగా ♦ రాలుకరఁగ
వీణవాయించు వైణిక ♦ శ్రేణి నెఱపు
నాత్మకులపూర్వ భూపనా ♦ మాంకగేయ
సత్ప్రబంధ కలాలాప ♦ సరణి వినుచు. 180

సీ. అలఁదిన బోనంపుఁ ♦ బోలపంబుచే ధిమిం
ధిమిశబ్దములయు మ ♦ ద్దెలరవంబు
ఖంగుఖంగున మ్రోయు ♦ కాంశ్య తాళధ్వనుల్
కలమంజుల విపంచి ♦ కా విశేష
కాకలీ కలనంబు ♦ లేక లీలగ నెంచఁ
గలయుపాంగశ్రుతిఁ ♦ గలసి మెలసి
కంకణ ఘణఘణల్ ♦ కాంచికా ఝుణఝుణల్
గజ్జెల ఘళఘళల్ ♦ గడలు కొనఁగ

నాగవాసంబు మోసల ♦ నాగవాస
నాకవాసవిలాసి ను ♦ ల్లాసఁగవాసి
సరస లాస్యంబు రసములా ♦ స్యములఁ దోఁప
నెఱప నరపాలవర్యుండు ♦ నిరుపమముగ. 181

క. కనుఁగొనుచుం గానక్రీడం
గనుగొనుచుండెన్ జయంత ♦ కంతువసంతుల్
దనమించు మెఱుఁగుచక్రం
దనమించుక వడయఁ గోరఁ ♦ దగుచెలువమునన్. 182

ఉ. అంతటఁ బెండ్లిపెద్దలగు ♦ నందఱుఁ బొందుగఁ గ్రందుకొన్న బల్
సంతసమొప్పనొప్పగుప్ర ♦ శస్తఫలోత్కరఖాద్యవస్తువుల్
దొంతులుగాఁగఁ గూర్చుకొని ♦ తూర్యరవంబులుతోడఁ గూడి రా
వింత యొసంగఁ గ్రొంత నడ ♦ పించిరి చెంతలఁ జంతలేకఁగన్.

ఉ. ఈరహిఁ వేడ్కఁ బాదనఖ ♦ కృంతనముఖ్యవివాహసమ్మతా
చారము మూఁడునాళ్ళుదగు ♦ సంపదలన్నెఱవేఱినంత ని
చ్చారతి నెచ్చెలుల్గడఁగి ♦ సంభ్రమమొప్పఁగ లీలఁగేళికా
గారమలంకరించిరి చొ ♦ కాటపువింత తెఱంగెసంగఁగన్. 184

క. ఆరేయినవోఢనుసిం
గారము చెలువారఁ జెలులు ♦ నైసేసిప్రియా
గారముచేరిచి మఱలిరి
నేరుపు మెఱయంగ వేరె ♦ నెపములవరుసన్. 185

క. జనపతికిఁ బట్టమహిషియె
యనువగు నర్ధాంగలక్ష్మి ♦ యనుమాట జగం

బున సార్థక్యము నొందఁగ
నొనరించిరి పెద్దలెల్ల ♦ నుల్లాసమునన్. 186

ఉ. అంతటఁ గొన్నినాళ్ళకుఁ బ్రి ♦ యంబున యంబును గూర్మిఁ జేర్మియే
కాంతమునందుఁ జూపుచుని ♦ జాధిపుఁడర్మిలి గారవింపఁగా
నింతి సమస్త భోగముల ♦ నెంతయు సంతసముప్పతిల్ల న
త్యంతము ఖ్యాతిఁ గాంచె జను ♦ లందఱు నిందిరఁ బోలునీమె నాన్.

సీ. ఏవంకఁ గనుఁగొన్న ♦ నెడలేక కడలేక
కోటవీటను సౌధ ♦ వాటకూట
మెచ్చోటఁ బరికింప ♦ నుచ్చావచములైన
రమ్యఫలద్రుమా ♦ రామసీమ
లేదండఁ దిలకింప ♦ స్వాదుపయఃపూర
సత్తీరమైనకా ♦ సారవార
మేచాయ వీక్షింప ♦ భూచక్రమెల్లెడ
సురుచిర ప్రత్యగ్ర ♦ పురవరంబు
లలర నిజరాష్ట్రమభివృద్ధి ♦ నతిశయిల్లె
ఠీవి నద్దేవి చెట్టఁ బ ♦ ట్టినది మొదలు
పొదలు కొదలేని సకలసం ♦ పదలతోడ
రాజ్యలక్ష్మీపదంబు సా ♦ ర్థకముగాఁగ. 188

సీ. పదుగురఁ బోషింపఁ ♦ బతిమది నూహింప
వేవురఁ బెంచఁగా ♦ విన్నవించుఁ
జలిపందిరులు పెట్టఁ ♦ జెలువుండు దలఁపూన
సత్రంబు లుంపించఁ ♦ జాలఁ గోరు

బీదలకన్నంబు ♦ బెట్టింపవయుఁ జెన్న
వస్త్రంబులు నొసంగ ♦ వాంఛఁ దెలుపుఁ
బిల్ల పాల్పోయింప ♦ విభుఁడు సంకల్పింపఁ
బాఁడియావుల నిడంగ ♦ బలిమి వేఁడుఁ
దండ్రి కన్నను బ్రజలపైఁ ♦ దల్లి కన్నఁ
బ్రేమ మెక్కువ యను వాక్య ♦ రీతి గాఁగ
నఖిలధర్మస్వరూపిణి ♦ యైతనర్చె
మహిత సుగుణకదంబయా ♦ మంగయాంబ. 189

గీ. ఆమె వెనువెంట విభుని బా ♦ హాగ్రపీఠి
నధివసించుట ధరణి రెం ♦ డవదియయ్యె
నెలమి విలసిల్లెఁ దనయొడ ♦ లినుమడింప
దేవి సౌశీల్యమును వేరె ♦ తెల్పనేల. 190

సీ. సుందరమందార ♦ కుందారవిందాది
మంజుసూనానూన ♦ మాల్యములను
బహుతర నవరత్న ♦ మహనీయ తపనీయ
కమనీయలసదలం ♦ కారములను
జామీకరాంచల ♦ క్షౌమాద్యమలకోమ
లానేక భవ్యన ♦ వ్యాంబరముల
ఘనసార ఘనసార ♦ కస్తూరికా సమ్మి
శ్రితగంధ గంధాను ♦ లేపనముల
బంధువిహారింగ నానతి ♦ పరికరమునకు
వాంఛలీడేర వినియోగ ♦ పఱచుకొనుచు
వలసినన్నియు నుపయోగ ♦ పఱుచుకొనుచుఁ
గాంతు కూరిమిఁ ద్యాగభో ♦ గములఁ దనిసె. 191

శా. సంసారంబను క్షీరవారినిధికిం ♦ జందోదయంబట్లు వి
ద్యాంసుల్మెచ్చులసద్గుణనిర్మలకళా ♦ భ్రాజత్కుమారాప్తికై
కంసధ్వంసికిఁ జెక్కు మిక్కుటపుఁ బ్రేం ♦ కర్యంబులబ్రాహ్మణో
త్తంసారాధన పూర్వకంబులుగనే ♦ తద్దంపతుల్సేయఁగన్. 192

మ. హరిసేవించి హరున్భజించి విధిమై ♦ నాసేతు శీతాచలాం
తరవిఖ్యాతము లైన క్షేత్రములయా ♦ తన్మాత్సనిభూమీసురు
ద్వరపూజల్పచరించి యారసనుతో ♦ త్పత్త్యర్థమర్థించుచోఁ
జిరకాలంబున కవ్వధూవరకృత ♦ శ్రీపుణ్యసంపత్తిచేన్. 193

సీ. పద్మనాయకజాత ♦ పాథోధిసంజాత
శోభాప్రశస్తకా ♦ స్తుభమనంగ
రేచర్లగోత్రవా ♦ ర్నిధిసముద్భూత స
త్ఫలభరానల్పక ♦ ల్పకమనంగ
భావుకతోదార ♦ రావువంశక్షీర
సాగర పరిపూర్ణ ♦ చంద్రుఁడనఁగఁ
బ్రాజ్యసామ్రాజ్యమై ♦ భవఘన స్వకుటుంబ
జలనిధానామృత ♦ కలశమనఁగ
హరిని సేవింప నర్థుల ♦ నాదరింపఁ
గళల వెలయింప విబుధసం ♦ ఘములఁ బెంప
సంపదల నింపునింపఁద ♦ ద్దంపతులకు
సొంపు దీపింప నారస ♦ సుతుఁడువొడమె. 194

చ. సుమహితరీతివృద్ధిగను ♦ నూననకాతని కవ్విభుండు పే
రిమము దనరంగ వేంకటకు ♦ మారమహీపతి సూర్యరాయ నా

మముఘటియించెదనన్నపకు ♦ మారుడు వర్ధిలుచూచిరాయుడై
యమితరమావివేక సము ♦ దారయశోవిభవాభిరాముఁడై. 195

క. అనిమజ్జనకుండుభవ
జ్జననీ జనకులవివాహ ♦ చారిత్రమునీ
జననము దనుకందెలిపిన
యనువున వినిపించినాఁడ ♦ నధిపవరేణ్యా. 196

చ. సతతము సత్క్రియల్గృతులొ ♦ సంగఁగృతుల్గొని సత్క్రియించుచుం
బ్రతతయశంబుమీఱరఘు ♦ రామునికైవడి రాజ్యమేలుచుణ
హితులను బోషించుచుణ రిపుల ♦ హెచ్చడఁగించుచుఁ బుత్త్రశాలివై
స్థితుఁడుగఁ జేయుచుం బరమ ♦ దీనులఁబోషించుచు వృద్ధిఁజెందుమీ.

సీ. అలదధీచ్యాదులు ♦ యాచింపఁగ నొసంగి
రడుగక యిడునియ్యు ♦ దారచరితుఁ
డలధర్మరాజాదు ♦ లనికేగి గెల్చిరి
కదలక గెల్చనీ ♦ ఘనబలాఢ్యుఁ
డలకృష్ణరాయేంద్రుఁ ♦ డష్టకవులఁ బోషించె
నూర్లబోషించునీ ♦ నుతమనీషుఁ
డలహరిశ్చంద్రేంద్రుఁ ♦ డాడి తప్పకనిల్చెఁ
దలఁచి తలంగఁడీ ♦ ధర్మశాలి
యనఁగననఘప్రదాతవై ♦ యరివిజేత
వైరసజ్ఞాతవై సూనృ ♦ తోరువాక్ప్రి
జేతవైక్ష్మాంతలఖ్యాతి ♦ నెగడుమయ్య
సూర్యరాయేంద్ర నృపచంద్ర ♦ సుగుణసాంద్ర. 198

సీ. సరససారస్వతా ♦ స్పదకవీశ్వరకోటి
గౌరవపరిపాటిఁ ♦ గాంచుఁగాత
శౌర్యాభిమానవి ♦ స్రంభ బంధురబంధు
బృందంబు మన్ననల్ ♦ చెందుఁగాత
నియతోపదాశుద్ధి ♦ నెగడు మంత్రులనికా
యంబనుగ్రహపాత్ర ♦ మగును గాత
భక్తితాత్పర్య సే ♦ వాధివరిష్ఠమా
సేవకావళికోల్వు ♦ చెలఁగుఁగాత
పాడిరహిమించుఁ బ్రజయెల్లఁ ♦ బాఁడి పంట
లుల్లసిల్లంగ ననురాగ ♦ మొందుఁగాత
రామరాజ్యంబు గాఁగ సా ♦ మ్రాజ్యమూని
పుడమినీవేలు శతవర్ష ♦ ములు నధీశ. 199

క. విద్వత్కవి సురభూజా
యుద్వేల యశస్సమాజ ♦ యురుతరతేజా
విద్విడ్జన సంజ్ఝాజా
సద్వినుతానేకసుగుణ ♦ సరిదధిరాజా. 200

మ. సమదారాతిజయేందిరారమణ ది ♦ క్సంచార జంఘాలకీ
ర్తిమహాప్రాభవభోగ వైభవకళా ♦ దేవేంద్రభూమీంద్ర స
త్తమ విప్రోత్తమ భక్తి తత్పరప్రసి ♦ ద్ధస్థూలలక్షవ్రతా
రమణీయాంగవిలాస భాసురవచః ♦ ప్రాగ్భారవాచస్పతీ. 201

కవిరాజవిరాజితము.

సలలితభాషణ ♦ శాంతివిభూషణ ♦ శత్రువిభీషణ ♦ శౌర్యరమా
నిలయశుభేక్షణ ♦ నీతివిచక్షణ ♦ నిర్మదలక్షణ ♦ నిత్యదయా

కలితహృదంతర • కావ్యనిరంతర • కౌతుకదంతుర • కవ్యధిరాట్
సులభసుదర్శన • సూక్ష్మవిమర్శన • సూచకకర్శన • సూర్యనృపా.

ఉ. భావుకనందనాబ్దమున • వ్రాయుటకున్ సమకట్టి నేర్పుమై
శ్రీవిజయాబ్దమందు నెఱి • చేఁ బరిపూర్తిగ సంఘటించి వి
శ్వావసు వత్సరంబుననొ • సంగితి జేనికి భవ్యకీర్తికిం
దావగు రామరాడ్విలస • నంబను నికట్కృతిఁ బ్రాభృతంబుగన్.

గద్య. ఇది శ్రీరామచంద్ర కృపాసాంద్ర కటాక్ష నిరీక్షణ సంలబ్ధ
శతావధానాది సరసతరకవితావిచక్షణ శ్రీమత్కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లి కులపయఃపయోనిధి కళానిధి సీతారామ
శాస్త్రి పౌత్త్ర వేంకటకృష్ణశాస్త్రి పుత్త్ర తమ్మనాభి
ధానాంతర వేంకటకృష్ణశాస్త్రి నామాగ్ర జన్మ
త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బరాయ
నామధేయ ప్రణీతంబైన రామరాయ
విలాసంబను ప్రబంధంబు నందు
సర్వంబును తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ